mohan
PUBLICATIONS

తెలంగాణ జాగృతి

# బతుకమ్మ పాటలు



# జాగృతి మాట

బతుకమ్మ పండుగ తెలంగాణ ప్రజలకు ప్రీతి పాత్రమైనది. భగవంతున్ని పూలతో పూజించడం ప్రపంచవ్యాప్తంగా ఉన్న ఆచారం అయితే ఆ పూలనే భగవంతునిగా పూజించడం తెలంగాణ ప్రత్యేకత. ఆ ప్రత్యేకతను చాటేదే మన బతుకమ్మ పండుగ. ఆ విశిష్ట సంస్కృతిని తరతరాలుగా బతికిస్తూ వస్తున్నది మన ఆడబిడ్డలే. బతుకమ్మ పండుగ అంటేనే పూలు, పాటలు, పడతులు.

బతుకమ్మ పాటలన్నీ అజ్ఞాత మహిళలచే ఆశువుగా అల్లబడినవి. రాగయుక్తమైన శైలి, సరళమైన భాషతో బతుకు చిత్రాన్ని ఆవిష్కరించే అందమైన పాటలివి. బతుకమ్మ పాటల్లోని సాహిత్య విలువలు అమూల్యమైనవి. జానపద, ఇతిహాస, చారిత్రాక ఘట్టాలతో పాటు సున్నితమైన మానవ సంబంధాలు ఈ పాటల ప్రధాన వస్తువులు. బతుకమ్మ పాటల్లో అమూల్యమైన చరిత్రకు గల మౌఖిక ఆధారాలతో పాటు అద్భుతమైన వ్యంగ్యం, కరిగించే ఆర్ద్రం అడుగడుగునా కనిపిస్తాయి. ఈ పాటలను సేకరించడం మార్పులకు తావులేకుండా వాటిని జానపదులకే సొంతమైన సహజశైలిలోనే భద్రపరచడం ఇప్పటి అవసరం. వాటిని అక్షరబద్ధం చేసి పాడుకోవడానికి ఉపయుక్తంగా ఉండేట్టు ఇప్పుడు పుస్తకరూపంలో మీ ముందుకు తీసుకొస్తున్నాం.

బతుకమ్మ పండుగ మన సాంస్కృతిక వైభవానికి ప్రతీక. వలస పాలనలో ప్రతికూల వాతావరణంలో సైతం హైకోర్టు నుండి అనుమతులు తీసుకొని ట్యాంక్ బండ్‌పై బతుకమ్మ నిర్వహిస్తూ వచ్చింది తెలంగాణ జాగృతి. సమైక్య పాలనలోనే బతుకమ్మకు నిధులు మంజూరు చేయించు కొవడం జాగృతితో సహా తెలంగాణ వాదులందరి విజయం. రాష్ట్ర ఆవిర్భావానంతరం ఈ విలక్షమైన పండుగను తెలంగాణ ప్రభుత్వం రాష్ట్ర పండుగగా గుర్తించడం హర్షనీయం. తెలంగాణ వ్యాప్తంగా ఊరూరా బతుకమ్మలతో ఈ పండుగను ఘనంగా జరుపుకుందాం. మన సంస్కృతిని, బతుకమ్మ పండుగ ద్వారా ప్రపంచానికి చాటుదాం. తెలంగాణకే సొంతమైన ఈ సాంప్రదాయాన్ని కొనసాగిద్దాం. మన వాఙ్మయాన్ని అక్షర బద్దం చేస్తూ ముందు తరాలకు భద్రంగా అందిద్దాం. బతుకమ్మ పండుగ సందర్భంగా ఆడబిడ్డలందరికి నా శుభాకాంక్షలు.

మీ

**కల్వకుంట్ల కవిత**

అధ్యక్షులు, తెలంగాణ జాగృతి

# విషయ సూచిక

# శ్రీలక్ష్మిదేవి ఉయ్యాలో

శ్రీలక్ష్మిదేవి ఉయ్యాలో
సృష్టి బతుకమ్మయ్యె ఉయ్యాలో
ధరచోళ దేశమున ఉయ్యాలో
ధర్మాంగుడనురాజు  ఉయ్యాలో
ఆ రాజు భార్యయు ఉయ్యాలో
అతివ సత్యవతి ఉయ్యాలో
నూరు నోములు నోమి ఉయ్యాలో
నూరు మంది గాంచె ఉయ్యాలో
వారు శూరులయ్యు ఉయ్యాలో
వైరులచే హతమైరి ఉయ్యాలో
తల్లిదండ్రులపుడు ఉయ్యాలో
తరగ శోకమున ఉయ్యాలో
తన రాజ్యములుబాసి ఉయ్యాలో
దాయాదులను బాసి ఉయ్యాలో
వనితతో ఆ రాజు ఉయ్యాలో
వనమందు వసించె ఉయ్యాలో
కలికి లక్ష్మి గూర్చి ఉయ్యాలో
ఘనతపం బొనరించె ఉయ్యాలో
ప్రత్యక్షమై లక్ష్మి ఉయ్యాలో
పలికె వరమడుగుమనె ఉయ్యాలో
వినుతించి వేడుచు ఉయ్యాలో
వెలది తన గర్భమున ఉయ్యాలో
పుట్టుమని వేడగా ఉయ్యాలో
పూబోణిమది మెచ్చి ఉయ్యాలో
సత్యవతి గర్భమున ఉయ్యాలో
జన్మించె శ్రీలక్ష్మి ఉయ్యాలో
అంతలో మునులునూ ఉయ్యాలో
అక్కడికి వచ్చిరీ ఉయ్యాలో
కపిల గాలవులునూ ఉయ్యాలో
కశ్యపాంగీరసలు ఉయ్యాలో
అత్రివశిష్ఠులూ ఉయ్యాలో
ఆ కన్నియను జూచి ఉయ్యాలో
బ్రతుకగనె ఈ తల్లి ఉయ్యాలో
బ్రతుకమ్మయనిరంత ఉయ్యాలో
తానుధన్యుండంచు ఉయ్యాలో
తన బిడ్డతో రాజు ఉయ్యాలో
నిజపట్టణము కేగి ఉయ్యాలో
నేల పాలించగ ఉయ్యాలో
శ్రీమహావిషుండు ఉయ్యాలో
చాక్రాంకడను  పేర ఉయ్యాలో
రాజు వేషంబున ఉయ్యాలో
రాజు ఇంటికి వచ్చి ఉయ్యాలో
ఇల్లరికమ  వుండి ఉయ్యాలో
అతివ బతుకమ్మను ఉయ్యాలో
పెండ్లాడి కొడుకలా ఉయ్యాలో
పెక్కుమందిగాంచె ఉయ్యాలో
ఆరువేలమంది ఉయ్యాలో
అతిసుందరాంగులు ఉయ్యాలో
ధర్మాంగుడనురాజు ఉయ్యాలో
తన భార్య సత్యవతి ఉయ్యాలో
సరిలేరు సిరులతో ఉయ్యాలో
సంతోషమొందిరి ఉయ్యాలో
జగతిపై బతుకమ్మ ఉయ్యాలో
శాశ్వతంబుగ నిలిచె ఉయ్యాలో.

# రామ రామ రామ ఉయ్యాలో

రామ రామ రామ ఉయ్యాలో
రామనే శ్రీరామ ఉయ్యాలో ||2||
రామ రామ నంది ఉయ్యాలో
రాగమెత్తరాదు ఉయ్యాలో ||2||
నెత్తిమీద సూర్యుడా ఉయ్యాలో
నెల వన్నెకాడ ఉయ్యాలో ||2||
పాపట్ల చంద్రుడా ఉయ్యాలో
బాలకుమారుడా ఉయ్యాలో ||2||
పెద్దలకు వచ్చింది ఉయ్యాలో
పెత్తారామాస ఉయ్యాలో ||2||
బాలలకు వచ్చింది ఉయ్యాలో
బతుకమ్మ పండుగ ఉయ్యాలో ||2||
తెల్లతెల్లయి గుళ్లు ఉయ్యాలో
తెల్లయమ్మా గుళ్ళు ఉయ్యాలో ||2||
పన్నెండేండ్ల నాడు ఉయ్యాలో
పాతవడ్డ గుళ్ళు ఉయ్యాలో ||2||
తెల్లయి ఏములాడ ఉయ్యాలో
రాజన్న గుళ్ళు ఉయ్యాలో ||2||
నల్లనల్లయి గుళ్ళు ఉయ్యాలో
నల్లయమ్మా గుళ్ళు ఉయ్యాలో ||2||
నల్లయి నల్లగొండ ఉయ్యాలో
నరసింహా గుళ్ళు ఉయ్యాలో ||2||
పచ్చపచ్చయి గుళ్ళు ఉయ్యాలో
పచ్చయమ్మా గుళ్ళు ఉయ్యాలో ||2||
పచ్చయి పర్వతాల ఉయ్యాలో
మల్లన్న గుళ్ళు ఉయ్యాలో ||2||
పర్వతాల మల్లన్న ఉయ్యాలో
పదములు సెలవయ్యా ఉయ్యాలో ||2||

రామ రామ రామ ఉయ్యాలో
రామనేశ్రీ రామ ఉయ్యాలో ||2||
ఇద్దరక్కా చెల్లెళ్ల ఉయ్యాలో
ఒక్క ఊరికిస్తే ఉయ్యాలో ||2||
ఒక్కడే మాయన్న ఉయ్యాలో
చూసన్నా వోడాయే ఉయ్యాలో ||2||
ఎట్ల వత్తు చెల్లెళ్ల ఉయ్యాలో
ఏరు అడ్డమాయే ఉయ్యాలో ||2||
ఏరుకు ఎలుపల్ల ఉయ్యాలో
తలుపు అడ్డమాయే ఉయ్యాలో ||2||
తలుపులకు తాళాలు ఉయ్యాలో
వెండి సీలాలు ఉయ్యాలో ||2||
వెండి సీల కింద ఉయ్యాలో
వెలపత్తి చెట్టు ఉయ్యాలో ||2||
వెలపత్తి చెట్టుకి ఉయ్యాలో
ఏడు విత్తులపత్తి ఉయ్యాలో ||2||
ఏడు గింజల పత్తి ఉయ్యాలో
ఎల్లనే ఆ పత్తి ఉయ్యాలో ||2||
ఆ పత్తి తీసుకుని ఉయ్యాలో
ఏడికి వోయిరి ఉయ్యాలో ||2||
పాలపాల పత్తి ఉయ్యాలో
పావురాయి పత్తి ఉయ్యాలో ||2||
ముసల్ది వడికింది ఉయ్యాలో
ముద్దుల పత్తి ఉయ్యాలో ||2||
వయస్సుది వడికింది ఉయ్యాలో
వన్నెల పత్తి ఉయ్యాలో ||2||
చిన్నది వడికింది ఉయ్యాలో
చిన్నెల పత్తి ఉయ్యాలో ||2||

ఆ పత్తి ఈ పత్తి ఉయ్యాలో
సాలె చింతల పత్తి ఉయ్యాలో ||2||
సాలె చింతలగాడ ఉయ్యాలో
సంగడి సారన్న ఉయ్యాలో ||2||
సంగడి సారన్న ఉయ్యాలో
సాగదీయవట్టే ఉయ్యాలో ||2||
సాగదీయవట్టే ఉయ్యాలో
ఆ పత్తి వడికి ఉయ్యాలో ||2||
ఆ పత్తి వడికిన ఉయ్యాలో
నెలకొక పోగు ఉయ్యాలో ||2||
దీవినె ఆ చీర ఉయ్యాలో
దివిటిల మీద ఉయ్యాలో ||2||
ఆ చీర కట్టుకుని ఉయ్యాలో
కొంగల బావికి ఉయ్యాలో ||2||
నీళ్లకంటూ పోతే ఉయ్యాలో
కొంగల బావికి ఉయ్యాలో ||2||
ఆ చీర కట్టుకుని ఉయ్యాలో
హంసల బావికి ఉయ్యాలో ||2||
హంసలన్నీ చేరి ఉయ్యాలో
అంచునంతా చూసే ఉయ్యాలో ||2||
ఆ చీర కట్టుకుని ఉయ్యాలో
పట్నంబు పోతిని ఉయ్యాలో ||2||
పట్నంబు పారిని ఉయ్యాలో
కొంగు బంగారేమో ఉయ్యాలో ||2||
కొంగు బంగారంబు ఉయ్యాలో
ఈ చీరలున్నాయా ఉయ్యాలో ||2||
గొప్పగా సాలెళ్ళు ఉయ్యాలో
నేసినారు ఈ చీర ఉయ్యాలో ||2||
దిగినే ఆ చీర ఉయ్యాలో
దివిటీల మీద ఉయ్యాలో ||2||
అన్నల వోయన్నా ఉయ్యాలో

అన్నలో పెద్దన్న ఉయ్యాలో ||2||
ఏడాదికోసారి ఉయ్యాలో
బతుకమ్మ పండుగ ఉయ్యాలో ||2||
ఆడపిల్లలనన్నా ఉయ్యాలో
నేను ఉన్న జాడు ఉయ్యాలో ||2||
కలిగేను పెద్దమ్మ ఉయ్యాలో
కన్నెతల్లి ఉన్నదా ఉయ్యాలో ||2||
ఏడంత్రాల ఉయ్యాలో
తీరైన బతుకమ్మ ఉయ్యాలో ||2||
తీరైన బతుకమ్మ ఉయ్యాలో
పువ్వులే తెచ్చిరి ఉయ్యాలో ||2||
వారిద్దరు ఒత్తురా ఉయ్యాలో
వీరిద్దరు ఒత్తురా ఉయ్యాలో ||2||
సంవత్సరానికి ఉయ్యాలో
ఒక్కసారే తల్లే ఉయ్యాలో ||2||
తంగేడు పూలనే ఉయ్యాలో
రాశిగా తెచ్చిరి ఉయ్యాలో ||2||
పోయిరా బతుకమ్మ ఉయ్యాలో
మళ్లీ ఏడాదికి ఉయ్యాలో ||2||
మళ్లీ రా బతుకమ్మ ఉయ్యాలో
మళ్లీ రావమ్మ ఉయ్యాలో ||2||

# ఒక్కేసి వెలగ పండే గౌరమ్మ

ఒక్కేసి వెలగ పండే గౌరమ్మ
దూరాన దోర పండే గౌరమ్మ ||2||
దూరాన దొరలైరి గౌరమ్మ
పట్నాన పంతులైరి గౌరమ్మ ||2||
అటు చూసి మాయన్నలు గౌరమ్మ
ఏడు మేడలెక్కిరి గౌరమ్మ ||2||
ఏడు మేడలెక్కి ఎత్తులు దాటంగా
ఎదుర్కోలియంగా ||2||
దొంగలేవరు దోసిరి గౌరమ్మ
బంగారు గుండ్ల వనమే గౌరమ్మ ||2||
ఒక్కేసి వెలగ పండే గౌరమ్మ
దూరాన దోర పండే గౌరమ్మ ||2||
శ్రీ లక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మ గౌరమ్మ ||2||
భారతీ దేవివై బ్రహ్మకిల్లాలివై ||2||
పార్వతీదేవివై పరమేశురాణివై ||2||
పరగ శ్రీలక్ష్మివై గౌరమ్మ
భార్యవైతివి హరికినీ గౌరమ్మ ||2||
ఒక్కేసి వెలగ పండే గౌరమ్మ
దూరాన దోర పండే గౌరమ్మ ||2||
ఎన్నెన్నో రూపాలు ఏడేడు లోకాలు ||2||
ఉన్న జనులకు కోరికలు సమకూర్చగా ||2||
కన్న తల్లివైతివి గౌరమ్మ
కామధేనువు అయితివి గౌరమ్మ ||2||
ఒక్కేసి వెలగ పండే గౌరమ్మ
దూరాన దోర పండే గౌరమ్మ ||2||
ముక్కోటి దేవతలు సక్కని కాంతలు ||2||
ఎక్కువ పూలు గూర్చి పెక్కు
నోములు నోమి ||2||
ఎక్కువ వారిరై గౌరమ్మ
ఈ లోకాముల నుండియు గౌరమ్మ ||2||
ఒక్కేసి వెలగ పండే గౌరమ్మ
దూరాన దోర పండే గౌరమ్మ ||2||
తమరి కంటే ఎక్కువ
దైవము ఎవ్వరూ లేరు ||2||
తమకింపు పుట్టింపు సకల లోకంబుల ||2||
క్రమముచే పాలించగా గౌరమ్మ
కన్నుల పండుగాయే గౌరమ్మ ||2||
ఒక్కేసి వెలగ పండే గౌరమ్మ
దూరాన దోర పండే గౌరమ్మ. ||2||

# ఒక్కేసి పువ్వేసి చందమామ

శివుడికి శ్రీ గద్దె చందమామ
మాకు సారె గద్దె చందమామ
రెండేసి పూలేసి చందమామ
రెండు జాములాయే చందమామ
శివపూజ యాలాయే చందమామ
శివుడు రాకపాయే చందమామ
మూడేసి పూలేసి చందమామ
శివుడింకా రాడాయే చందమామ
శివుని పూజ యాలాయే చందమామ
గోరెంట చెట్లల చందమామ
గోడపెట్ట పాయే చందమామ
నాల్గేసి పూలేసి చందమామ
నాల్గు జాములాయే చందమామ
శివ పూజ యాలాయే చందమామ
శివుడు రాకపాయే చందమామ
రుద్రాక్ష వనములో చందమామ
నిద్రించవాయే చందమామ
ఐదేసి పూలేసి చందమామ
ఐదు జాములాయే చందమామ
శివుడింకా రాడాయే చందమామ
శివుని పూజ యాలాయే చందమామ
బంతి వనములోన చందమామ
బంతులాడవాయే చందమామ
ఆరేసి పూలేసి చందమామ
ఆరు జాములాయే చందమామ
శివ పూజ యాలాయే చందమామ
శివుడింకా రాడాయే చందమామ
మల్లె వనములోన చందమామ
మాటలాడవాయే చందమామ
ఏడేసి పూలేసి చందమామ
ఏడు జాములాయే చందమామ
రత్నాల గౌరు చందమామ
నీరాసి కలుపుళ్లు చందమామ
ఎనిమిదో పువ్వేసి చందమామ
ఎనిమిది జాములాయే చందమామ
తీగె తీగల బిందె చందమామ
రాగి తీగల బిందె చందమామ
తొమ్మిదో పువ్వేసి చందమామ
తొమ్మిది జాములాయే చందమామ
రాశువాడలేసి చందమామ
రాశిగలపరారే చందమామ
పదేసి పూలేసి చందమామ
పది జాములాయే చందమామ
తీగె తీగల బిందె చందమామ
రాగి తీగల బిందె చందమామ
శివపూజ యాలాయే చందమామ
శివుడు రాకపాయే చందమామ
శివుడికి శ్రీ గద్దె చందమామ
మాకు సారె గద్దె చందమామ
శివుడికి శ్రీ గద్దె చందమామ
మాకు సారె గద్దె చందమామ.

# ఏమేమి పువ్వొప్పునే గౌరమ్మ

ఏమేమి పువ్వొప్పునే గౌరమ్మ
ఏమేమి కాయొప్పునే గౌరమ్మ
తంగేడు పువ్వొప్పునే గౌరమ్మ
తంగేడు కాయొప్పునే గౌరమ్మ
తంగేడు చెట్టు కింద ఆట
సిల్కాలార పాట సిల్కాలారా
కల్కి సిల్కాలారా కందుమ్మ
గుడ్డలు రానువోను అడుగులు
తీరుద్ద ఆశలు తారు గోరంటలు
గణమైన పొన్న పువ్వే గౌరమ్మ
గజ్జాల ఒడ్డానమే గౌరమ్మ
ఏమేమి పువ్వొప్పునే గౌరమ్మ
ఏమేమి కాయొప్పునే గౌరమ్మ
గుమ్మడి పువ్వొప్పునే గౌరమ్మ
గుమ్మడి కాయొప్పునే గౌరమ్మ
గుమ్మడి చెట్టు కింద ఆట
సిల్కాలార పాట సిల్కాలారా
కల్కి సిల్కాలారా కందుమ్మ గుడ్డలు
రానువోను అడుగులు
తీరుద్ద ఆశలు తారు గోరంటలు
గణమైన పొన్న పువ్వే గౌరమ్మ
గజ్జాల ఒడ్డానమే గౌరమ్మ
ఏమేమి పువ్వొప్పునే గౌరమ్మ
ఏమేమి కాయొప్పునే గౌరమ్మ
రుద్రాక్ష పువ్వొప్పునే గౌరమ్మ
రుద్రాక్ష కాయొప్పునే గౌరమ్మ
రుద్రాక్ష చెట్టు కింద
ఆట సిల్కాలార పాట సిల్కాలారా
కల్కి సిల్కాలారా కందుమ్మ గుడ్డలు
రానువోను అడుగులు
తీరుద్ద ఆశలు తారు గోరంటలు
గణమైన పొన్న పువ్వే గౌరమ్మ
గజ్జాల ఒడ్డానమే గౌరమ్మ
ఏమేమి పువ్వొప్పునే గౌరమ్మ
ఏమేమి కాయొప్పునే గౌరమ్మ
కాకర పువ్వొప్పునే గౌరమ్మ
కాకర కాయొప్పునే గౌరమ్మ
కాకర చెట్టు కింద ఆట
సిల్కాలార పాట సిల్కాలారా
కల్కి సిల్కాలారా కందుమ్మ గుడ్డలు
రానువోను అడుగులు
తీరుద్ద ఆశలు తారు గోరంటలు
గణమైన పొన్న పువ్వే గౌరమ్మ
గజ్జాల ఒడ్డానమే గౌరమ్మ
ఏమేమి పువ్వొప్పునే గౌరమ్మ
ఏమేమి కాయొప్పునే గౌరమ్మ
చామంతి పువ్వొప్పునే గౌరమ్మ
చామంతి కాయొప్పునే గౌరమ్మ..
చామంతి చెట్టు కింద ఆట
సిల్కాలార పాట సిల్కాలారా
కల్కి సిల్కాలారా కందుమ్మ
గుడ్డలు రానువోను అడుగులు
తీరుద్ద ఆశలు తారు గోరంటలు
గణమైన పొన్న పువ్వే గౌరమ్మ
గజ్జాల ఒడ్డానమే గౌరమ్మ
ఆ పూలు తెప్పించి పూజించి
గంధముల కడిగించి కుంకుమల జాడించి
నీ నోము నీకిత్తుమే గౌరమ్మ
మా నోము మాకియ్యవే గౌరమ్మ
నీ నోము నీకిత్తుమే గౌరమ్మ
మా నోము మాకియ్యవే గౌరమ్మ
నీ నోము నీకిత్తుమే గౌరమ్మ
మా నోము మాకియ్యవే గౌరమ్మ

# చిత్తు చిత్తుల బొమ్మ

చిత్తు చిత్తుల బొమ్మ శివుని ముద్దుల గుమ్మ ||2||
బంగారు బొమ్మ దొరికెనమ్మో ఈ వాడలోన ||2||
చిత్తు చిత్తుల బొమ్మ శివుని ముద్దుల గుమ్మ ||2||
బంగారు బొమ్మ దొరికెనమ్మో ఈ వాడలోన ||2||
రాగి బిందె తీసుక రమణి నీళ్లకు పోతే ||2||
రాములోరు ఎదురాయెనమ్మో ఈ వాడలోన ||2||
చిత్తు చిత్తుల బొమ్మ శివుని ముద్దుల గుమ్మ ||2||
బంగారు బొమ్మ దొరికెనమ్మో ఈ వాడలోన ||2||
వెండి బిందె తీసుక వెలది నీళ్లకు పోతే ||2||
వెంకటేషుడు ఎదురాయెనమ్మో ఈ వాడలోన ||2||
చిత్తు చిత్తుల బొమ్మ శివుని ముద్దుల గుమ్మ ||2||
బంగారు బొమ్మ దొరికెనమ్మో ఈ వాడలోన ||2||
బంగారు బిందె తీసుక బామ నీళ్లకు పోతే ||2||
భగవంతుడు ఎదురాయెనమ్మో ఈ వాడలోన ||2||
చిత్తు చిత్తుల బొమ్మ శివుని ముద్దుల గుమ్మ ||2||
బంగారు బొమ్మ దొరికెనమ్మో ఈ వాడలోన ||2||
పగిడి బిందె తీసుకు పడితి నీళ్లకు పోతే ||2||
పరమేశుడు ఎదురాయెనమ్మో ఈ వాడలోన ||2||
చిత్తు చిత్తుల బొమ్మ శివుని ముద్దుల గుమ్మ ||2||
బంగారు బొమ్మ దొరికెనమ్మో ఈ వాడలోన ||2||
ముత్యాల బిందె తీసుక ముదిత నీళ్లకు పోతే ||2||
ముద్దు కృష్ణుడు ఎదురాయెనమ్మో ఈ వాడలోన ||2||
చిత్తు చిత్తుల బొమ్మ శివుని ముద్దుల గుమ్మ ||2||
బంగారు బొమ్మ దొరికెనమ్మో ఈ వాడలోన ||2||
చిత్తు చిత్తుల బొమ్మ శివుని ముద్దుల గుమ్మ ||2||
బంగారు బొమ్మ దొరికెనమ్మో ఈ వాడలోన ||2||
బంగారు బొమ్మ దొరికెనమ్మో ఈ వాడలోన ||2||
బంగారు బొమ్మ దొరికెనమ్మో ఈ వాడలోన ||2||
బంగారు బొమ్మ దొరికెనమ్మో ఈ వాడలోన ||2||

# కలవారి కోడలు ఉయ్యాలో

కలవారి కోడలు ఉయ్యాలో
కనక మహాలక్ష్మి ఉయ్యాలో
కడుగుతున్నది పప్పు ఉయ్యాలో
కడవళ్లోన పోసి ఉయ్యాలో
అప్పుడే వచ్చేను ఉయ్యాలో
ఆమె పెద్దన్న ఉయ్యాలో
కాళ్లకు నీళ్లిచ్చి ఉయ్యాలో
కన్నీళ్లు దీసి ఉయ్యాలో
ఎందుకు సెల్లెలా ఉయ్యాలో
ఏమి కష్టాలమ్మా ఉయ్యాలో
తుడుచుకో కన్నీళ్లు ఉయ్యాలో
ముడుచుకో కురులమ్మ ఉయ్యాలో
ఎత్తుకో బిడ్డాను ఉయ్యాలో
వెళ్లి వద్దాము ఉయ్యాలో
చేరిమి వారితో ఉయ్యాలో
చెప్పిరా పోవమ్మా ఉయ్యాలో
పట్టె మంచం మీద ఉయ్యాలో
పవళించినామా ఉయ్యాలో
మాయన్నల వచ్చిరి ఉయ్యాలో
మమ్ము పంపుతారా ఉయ్యాలో
నేనెరుగ నేనెరుగ ఉయ్యాలో
మీ అత్తను అడుగు ఉయ్యాలో
అరుగుల్ల కూసున్న ఉయ్యాలో
ఓ అత్తగారు ఉయ్యాలో
మా అన్నలు వచ్చిరి ఉయ్యాలో
మమ్ము పంపుతారా ఉయ్యాలో
నేనెరుగ నేనెరుగ ఉయ్యాలో
మీ బావను అడుగు ఉయ్యాలో
భారతం చదివేటి ఉయ్యాలో
బావ పెద్ద బావ ఉయ్యాలో
మా అన్నలు వచ్చిరి ఉయ్యాలో
మమ్ము పంపుతారా ఉయ్యాలో
నేనెరుగ నేనెరుగ ఉయ్యాలో
మీ అక్కను అడుగు ఉయ్యాలో
వంటశాలలో ఉన్న ఉయ్యాలో
ఓ అక్క గారూ ఉయ్యాలో
మా అన్నలు వచ్చిరి ఉయ్యాలో
మమ్ము పంపుతారా ఉయ్యాలో
నేనెరుగ నేనెరుగ ఉయ్యాలో
నీ భర్తనే అడుగు ఉయ్యాలో
రచ్చలో కూర్చున్న ఉయ్యాలో
రాజేంద్రబోగి ఉయ్యాలో
మా అన్నలు వచ్చిరి ఉయ్యాలో
మమ్ము పంపుతారా ఉయ్యాలో
కట్టుకో చీరలు ఉయ్యాలో
పెట్టుకో సొమ్ములు ఉయ్యాలో
ఎత్తుకో బిడ్డను ఉయ్యాలో
వెళ్లి రా ఊరికి ఉయ్యాలో
పుట్టినింటికి నీవు ఉయ్యాలో
శుభముగా పోయిరా ఉయ్యాలో
మెట్టినింటికి నీవు ఉయ్యాలో
క్షేమంగా తిరిగి రా ఉయ్యాలో
మెట్టినింటికి నీవు ఉయ్యాలో
క్షేమంగా తిరిగి రా ఉయ్యాలో.

# శ్రీ లక్ష్మి నీ మహిమలు గౌరమ్మ

శ్రీ లక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మా గౌరమ్మ ||2||
భారతీ దేవివై బ్రహ్మకిల్లాలివై ||2||
పార్వతీ దేవివై పరమేశ్వరాణివై ||2||
పరగశ్రీ లక్ష్మివై గౌరమ్మ
భార్యవైతివి హరికినీ గౌరమ్మ ||2||
శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మా గౌరమ్మ ||2||
ఎన్నెన్నో రూపాలు ఏడేడు లోకాలు ||2||
ఉన్న కోరికలన్నీ జనులకు సమకూర్చగా ||2||
కన్న తల్లివైతివి గౌరమ్మ
కామధేనువైతివి గౌరమ్మ ||2||
శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మ గౌరమ్మ ||2||
ముక్కోటి దేవతలు సక్కాని కాంతలు ||2||
ఎక్కువగా నిన్ను కొలిచి పెక్కు
నోములు నోచి ||2||
ఎక్కువ వారిరైగా గౌరమ్మ
ఈ లోకమున నుండియు గౌరమ్మ ||2||
శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మా గౌరమ్మ ||2||
నల్ల వరి బియ్యం మల్లె మొగ్గలు లేత ||2||
తెల్ల వజ్రంబులు ముల్లోకాములనేలే ||2||
తల్లి నీ దంతమ్ములు గౌరమ్మ
దానిమ్మ బీజములు గౌరమ్మ ||2||
శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మా గౌరమ్మ ||2||
నిగనిగ మానేటి నగు
ముఖము చూచితే ||2||
జగతి పున్నమినాడు చంద్రుణ్ని ఓడించి ||2||
సొగసైన నీ తిలకము గౌరమ్మ
చూసితే ఆనందం గౌరమ్మ ||2||
శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మా గౌరమ్మ ||2||
తమరికంటే ఎక్కువ దైవము
ఎవ్వరు లేరు ||2||
తమకింపు పట్టింపు సకల లోకంబులా ||2||
క్రమముచే పాలింపగా గౌరమ్మ
కన్నుల పండుగాయే గౌరమ్మ ||2||
శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మా గౌరమ్మ ||2||
బాలలు, వృద్ధులు ప్రౌఢాంగనలు కన్నె ||2||
ప్రాయపుకాంతలు పరగాశ్వయుజశుద్ధ ||2||
పాడ్యమి మొదలుకొని గౌరమ్మ
భక్తిని అందు నిలిపి గౌరమ్మ ||2||
శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మా గౌరమ్మ ||2||
తొమ్మిది దినములు
నెమ్మనంగమున పొంగి ||2||
అమ్మలక్కలు కూడి ఆస్తితో తమకున్న ||2||
సొమ్ములు ధరియించగా గౌరమ్మ
శోభనమ్మని పాడుచూ గౌరమ్మ ||2||
శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మా గౌరమ్మ ||2||
బంగారు పువ్వులు బతుకమ్మయని పేర్చి ||2||
మంగళంబున నిన్ను మధ్యలా నిలిపి ||2||
అరే రంగు రంగుల పువ్వులు గౌరమ్మ
రాశి తంగేడు పువ్వులు గౌరమ్మ ||2||
శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మా గౌరమ్మ ||2||

కట్ల పుష్పంబులు తామర పువ్వులు ||2||
తలగోడు పువ్వులు గన్నేరు పువ్వులు ||2||
పొట్ల పువ్వులు చల్లుతూ గౌరమ్మ
పొగడ పువ్వులు నింపుతూ గౌరమ్మ ||2||
శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మా గౌరమ్మ ||2||
పారిజాతంబులు పైడి తంగేడు పూలు ||2||
గోరెంట పున్నెలు గురివింద మల్లెలు ||2||
ఈరు రుద్రాక్ష పూలు గౌరమ్మ
పేరైన సుమజాతులు గౌరమ్మ ||2||
శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మా గౌరమ్మ ||2||
పన్నీరు అత్తరు పచ్చి గంధములు ||2||
పరిమళంబులు బుక్క బాగైన కస్తురు ||2||
పసుపు కుంకుమ గుప్పుతు గౌరమ్మ
పాటలెన్నో పాడుచూ గౌరమ్మ ||2||
శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మా గౌరమ్మ ||2||
పాల మీగడలట్లు పానకంబు జున్ను ||2||
పోలేలు, మౌడీలు నులముద్దలు ||2||
మేలు చెక్కర గర్జలు గౌరమ్మ
మేలుగా నర్పింతురు గౌరమ్మ ||2||
శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మ గౌరమ్మ ||2||
నూటొక్క పువ్వులు
కోటి నోములు నోమ ||2||
మేటిగా కాంతులు ఆటపాటలతోటి ||2||
మాటికి నిన్ను మెప్పుగా గౌరమ్మ
మంగళారతులు పాడగా గౌరమ్మ ||2||
శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మా గౌరమ్మ ||2||
కోరి ఈ రీతిగా చేరి పూజింతుము ||2||

చారు సుందరములైన
సౌభాగ్యములనిచ్చి ||2||
కారుణ్యాము లేమిమి గౌరమ్మ
కల్పాయి ఒసగు మాకు గౌరమ్మ ||2||
శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మా గౌరమ్మ ||2||
పైరు పంటలు పల్లెటూర్లలో పచ్చగా ||2||
పాడి ఆవులు పిల్ల పాపలతో నిండుగా ||2||
ఎల్ల కులముల వారిని గౌరమ్మ
చల్లగా చూడవమ్మా గౌరమ్మ ||2||
శ్రీలక్ష్మి నీ మహిమలు గౌరమ్మ
చిత్రమై తోచునమ్మా గౌరమ్మ ||2||
పాడిన వారికి పాట వినువారికి
జోడు పల్లాకిలు జడతారు గుర్రాలు ||2||
చూడసొంపగా గజములు గౌరమ్మ
వేడుక తోనిచ్చును గౌరమ్మ ||2||

# కట్టెంట పొయ్యేటి ఉయ్యాలో

కట్టెంట పొయ్యేటి ఉయ్యాలో
బండ్లెవ్వరి బండ్లు ఉయ్యాలో ||2||
కట్టెంట పొయ్యేవి ఉయ్యాలో
మా అన్నల బండ్లు ఉయ్యాలో ||2||
అన్నల బండ్లు కావు ఉయ్యాలో
అందాల బండ్లు ఉయ్యాలో ||2||
ఆ దేవదేవుణ్ని ఉయ్యాలో
కొలిచేటి బండ్లు ఉయ్యాలో ||2||
ఎన్నాళ్లకొచ్చినవి ఉయ్యాలో
జొన్నల బండ్లు ఉయ్యాలో ||2||
జొన్నల బండ్లు కాదు ఉయ్యాలో
అన్నల బండ్లు ఉయ్యాలో ||2||
అన్నల బండ్లు అయితే ఉయ్యాలో
కొంగులు వడ్డాలే ఉయ్యాలో ||2||
నా ఏడుగురు వదినండ్లు ఉయ్యాలో
తట్టాలు మోయంగా ఉయ్యాలో ||2||
తట్ట తట్టకు నేను ఉయ్యాలో
తల్లినీ అయిదును ఉయ్యాలో ||2||
తల్లినీ అయిన నేను ఉయ్యాలో
దీవెనలిద్దునూ ఉయ్యాలో ||2||
సల్లంగా ఉండన్న ఉయ్యాలో
పది కాలాలపాటు ఉయ్యాలో ||2||
నా ఏడుగురు అన్నలు ఉయ్యాలో
బాయినే తోడంగా ఉయ్యాలో ||2||
నా ఏడుగురు వదినండ్లు ఉయ్యాలో
తట్టనే గుంజంగ ఉయ్యాలో ||2||
తట్ట తట్టకు నేను ఉయ్యాలో
తాబేలు నైదును ఉయ్యాలో ||2||
నా ఏడుగురు అన్నలు ఉయ్యాలో
దుక్కిలు దున్నంగా ఉయ్యాలో ||2||
నా ఏడుగురు వదినండ్లు ఉయ్యాలో
నలిని ఏరంగా ఉయ్యాలో ||2||
దుక్కి దుక్కికి నేను ఉయ్యాలో
దుర్గమ్మ నైదును ఉయ్యాలో ||2||
నా ఏడుగురు అన్నలు ఉయ్యాలో
నాగళ్లు కట్టంగా ఉయ్యాలో ||2||
నా ఏడుగురు వదినండ్లు ఉయ్యాలో
నాట్లే వేయంగా ఉయ్యాలో ||2||
నాటు మడుల్లోన ఉయ్యాలో
నాగమ్మ నైదును ఉయ్యాలో ||2||
నా ఏడుగురు అన్నలు ఉయ్యాలో
కోతలు కోయంగా ఉయ్యాలో ||2||
కోత కోతకు నేను ఉయ్యాలో
కొడవలి నైదును ఉయ్యాలో ||2||
నా ఏడుగురు వదినండ్లు ఉయ్యాలో
రాశుల పోయంగా ఉయ్యాలో ||2||
రాశి రాశిలోన ఉయ్యాలో
వాసిగా నేనుంటా ఉయ్యాలో ||2||
రత్నాలు మీ ఇంట ఉయ్యాలో
రాశులై నిలువంగా ఉయ్యాలో ||2||
రత్నాలు మీ ఇంట ఉయ్యాలో
రాశులై నిలువాలే ఉయ్యాలో ||2||

# శ్రీ రామునీ తల్లి ఉయ్యాలో

శ్రీ రామునీ తల్లి ఉయ్యాలో శ్రీమతి కౌసల్య ఉయ్యాలో
ప్రేమతో శాంతను ఉయ్యాలో పిలిచి దగ్గర తీసి ఉయ్యాలో
నా తల్లి శాంతమ్మ ఉయ్యాలో నా ముద్దులపట్టి ఉయ్యాలో
అత్తవారింటికి  ఉయ్యాలో ఆనందముగా పొమ్ము ఉయ్యాలో
అత్తమామల సేవ ఉయ్యాలో ఉత్తమంగా చెయ్యి ఉయ్యాలో
భర్తను సేవించ ఉయ్యాలో వైకుంఠంబున ఉయ్యాలో
వారిపైన ప్రేమ ఉయ్యాలో వాసుదేవుని పూజ ఉయ్యాలో
పేదరికము చూసి ఉయ్యాలో ప్రీతి తప్పకు తల్లి ఉయ్యాలో
కలిగి ఉన్నంతల ఉయ్యాలో కనిపెట్టి తిరగాలి ఉయ్యాలో
ఇరుగు పొరుగిండ్లకు ఉయ్యాలో తిరగబోకోయమ్మ ఉయ్యాలో
అందుకే ముందుగా ఉయ్యాలో ఆలోచనుండాలి ఉయ్యాలో
ఏది చూసిన గాని ఉయ్యాలో ఏది చేసినగాని ఉయ్యాలో
చేసే పనులందు ఉయ్యాలో చిత్తంబు నిలపాలి ఉయ్యాలో
పని చెడినంక ఉయ్యాలో చింతించి ఫలమేమి ఉయ్యాలో
మాట జారిన వెనుక ఉయ్యాలో మరితిరిగి రాదమ్మ ఉయ్యాలో
అందుకే ముందుగా ఉయ్యాలో అలోచనుండాలి ఉయ్యాలో
అపకీర్తి తోను ఉయ్యాలో బతికి ఫలమేమి ఉయ్యాలో
సాధు సత్పురుషులు ఉయ్యాలో సమయానికేతెంచు ఉయ్యాలో
అన్నపానాదుల ఉయ్యాలో ఆదరించుము తల్లి ఉయ్యాలో
అత్తవారింటికి ఉయ్యాలో అమ్మవారింటికి ఉయ్యాలో
మంచిపేరు తెమ్ము ఉయ్యాలో మా తల్లి శాంతమ్మ ఉయ్యాలో
కొడుకులు బిడ్డలు ఉయ్యాలో కొమరొప్పకలగని ఉయ్యాలో
నిండు ముత్తైదువై ఉయ్యాలో ఉండవమ్మ తల్లి ఉయ్యాలో
మంచిపేరు తెమ్ము ఉయ్యాలో మా తల్లి శాంతమ్మ ఉయ్యాలో
కొడుకులు బిడ్డలు ఉయ్యాలో కొమరొప్ప కలగని ఉయ్యాలో
నిండు ముత్తైదువై ఉయ్యాలో ఉండవమ్మ తల్లి ఉయ్యాలో.

# ఆటగూటం మీద ఉయ్యాలో

ఆటగూటం మీద ఉయ్యాలో
అయోధ్యలోన ఉయ్యాలో
అలసొచ్చె లక్ష్మణుడు ఉయ్యాలో
ఆటలాడి వచ్చె ఉయ్యాలో
ఆటలాడి వచ్చె ఉయ్యాలో
అలసి సొలసి వచ్చె ఉయ్యాలో
వదినె దాహమని ఉయ్యాలో
సీత చెంతకు పాయె ఉయ్యాలో
ఏమని అనదాయె ఉయ్యాలో
మా తల్లి సీతమ్మ  ఉయ్యాలో
అటు నుండి లక్ష్మణుడు ఉయ్యాలో
అన్న వద్దకు పాయె ఉయ్యాలో
అలిగున్న రాముడు ఉయ్యాలో
ఏమని అనడాయె ఉయ్యాలో
సీతరాముల మధ్యన ఉయ్యాలో
వాదంబులాయెనె ఉయ్యాలో
యోచించి లక్ష్మణుడు ఉయ్యాలో
చిలుక చెంతకు పాయె ఉయ్యాలో
చిలుకరో చిలుక ఉయ్యాలో
వాదమాయె చిలుక ఉయ్యాలో
మీ అమ్మ మీ నాన్న ఉయ్యాలో
అలగినారమ్మ ఉయ్యాలో
అలకలు తీర్చవే ఉయ్యాలో
ఓ రామ చిలుక ఉయ్యాలో
నీ చిన్ని ముక్కుకు ఉయ్యాలో
ముక్కెర చేయిస్త ఉయ్యాలో
నీ చిన్ని రెక్కలకు ఉయ్యాలో
వెండి పోయిస్తా ఉయ్యాలో
నీ చిన్ని కాళ్లకు ఉయ్యాలో
గజ్జెలేయిస్తా ఉయ్యాలో
నువ్వు పోయె తోవల్ల ఉయ్యాలో
శెనగ నాటిస్తా ఉయ్యాలో
శెనగ తిని చేయి కడగ ఉయ్యాలో
చెలిమె తవ్విస్త ఉయ్యాలో.

# శ్రీ గణేశ్వర ఉయ్యాలో

శ్రీ గణేశ్వర ఉయ్యాలో
చిత్తంబు తోని ఉయ్యాలో
మదిలోన నిను తలచి ఉయ్యాలో
మందార పూలతో ఉయ్యాలో
మల్లె పువ్వులతోడ ఉయ్యాలో
మహదేవ నిను కొలతు ఉయ్యాలో
పొన్న పువ్వుల తోడ ఉయ్యాలో
పొగిడి పూజింతుము ఉయ్యాలో
సంపెంగ పువ్వులతో ఉయ్యాలో
ఇంపుగా పూజింతుము ఉయ్యాలో
కలువ పువ్వులతోటి ఉయ్యాలో
కొలుతుము నిను దేవ ఉయ్యాలో
ముక్కోటి దేవతలు ఉయ్యాలో
ముందుగా నీ పూజలు ఉయ్యాలో
సకల జనాలను ఉయ్యాలో
సర్వ లోకముల ఉయ్యాలో
కరుణించి కాపాడు ఉయ్యాలో
శరణు శివపుత్రుడా ఉయ్యాలో
కరుణించి కాపాడు ఉయ్యాలో
శరణు శివపుత్రుడా ఉయ్యాలో.

# చినుకు చినుకు వాన ఉయ్యాలో

చినుకు చినుకు వాన ఉయ్యాలో
చిత్తడి వాన ఉయ్యాలో
పోదాము చిత్తరి ఉయ్యాలో
మూడు బాటలకాడికి ఉయ్యాలో
బాలలు బతుకమ్మ ఉయ్యాలో
పండుగనడిగిరి ఉయ్యాలో
పెద్దలకు వచ్చింది ఉయ్యాలో
పెతరమావాస్య ఉయ్యాలో
వజ్రాల వాకిట్లొ ఉయ్యాలో
ముత్యాల ముగ్గులు ఉయ్యాలో
చిన్నంగ సన్నంగ ఉయ్యాలో
జల్లు కురవంగ ఉయ్యాలో
ఏ రాజు కురిపించె ఉయ్యాలో
ఏడు ఘడియల్లు ఉయ్యాలో
బంగారు వానలు ఉయ్యాలో
బాలాదరిమీద ఉయ్యాలో
అచ్చుమల్లెలు కురిసె ఉయ్యాలో
ఆలాద్రి మీద ఉయ్యాలో
సన్నమెల్లు కురిసె ఉయ్యాలో
చెన్నయ్యమీద ఉయ్యాలో
బొడ్డు మల్లెలు కురిసె ఉయ్యాలో
బోనగిరిమీద ఉయ్యాలో
బంతిపూలు పూసె ఉయ్యాలో
వనమెల్లకాసె ఉయ్యాలో
బంతిపూల తోడ ఉయ్యాలో
బతుకమ్మ పేర్చిరి ఉయ్యాలో
తంగెడు పువ్వుల్ల ఉయ్యాలో
తల్లి నిన్ను పేర్చి ఉయ్యాలో
కట్లాయి పువ్వుల్ల ఉయ్యాలో
కన్నెలంతకూడి ఉయ్యాలో
పడచులంత కూడి ఉయ్యాలో
పసిడి బతుకమ్మను ఉయ్యాలో
చిన్నారులంత ఉయ్యాలో
చిట్టి బతుకమ్మను ఉయ్యాలో
భక్తితో పేర్చిరి ఉయ్యాలో
బంగారు బతుకమ్మ ఉయ్యాలో
ఆడబిడ్డలంత ఉయ్యాలో
అత్తరు పన్నీరు ఉయ్యాలో
అత్తకోడండ్లు ఉయ్యాలో
గద్వాల చీరలు ఉయ్యాలో
తల్లిబిడ్డలంత ఉయ్యాలో
సన్నంచు చీరలు ఉయ్యాలో
అక్కచెల్లెళ్లు ఉయ్యాలో
పట్టంచు చీరలు ఉయ్యాలో
బయలెల్లినారు ఉయ్యాలో
భామలంత కూడి ఉయ్యాలో
ఆలు ఆడ ఉయ్యాలో
కచ్చీరు కొచ్చిరి ఉయ్యాలో
ఆఘమేఘాల మీద ఉయ్యాలో
వానదేవుడొచ్చె ఉయ్యాలో.

# జనకు జనకునింట్లో ఉయ్యాలో

జనకు జనకునింట్లో ఉయ్యాలో
సత్య జనకునింట్లో ఉయ్యాలో
పుట్టింది సీతమ్మ ఉయ్యాలో
పురుడే కోరింది ఉయ్యాలో
పెరిగింది సీతమ్మ ఉయ్యాలో
పెరుగన్నము తిని ఉయ్యాలో
చిన్న చిన్న బొమ్మరిల్లు
ఉయ్యాలో
కట్ట నేర్చిందమ్మ ఉయ్యాలో
చిన్న బొమ్మల పెండ్లి ఉయ్యాలో
చెయ్య నేర్చిందమ్మ ఉయ్యాలో
పెద్ద పెద్ద బొమ్మరిల్లు ఉయ్యాలో
కట్ట నేర్చిందమ్మ ఉయ్యాలో
పెద్ద బొమ్మల పెండ్లి ఉయ్యాలో
చెయ్య నేర్చిందమ్మ ఉయ్యాలో
లక్కయికోలలు ఉయ్యాలో
దంచ నేర్చిందమ్మ ఉయ్యాలో
వెండియి మొంటెల్ల ఉయ్యాలో
చెరగ నేర్చిందమ్మ ఉయ్యాలో
పయిడియె జల్లెండ్ల ఉయ్యాలో
పట్ట నేర్చిందమ్మ ఉయ్యాలో
పెరుగుతూ ఆ సీత ఉయ్యాలో
పెండ్లి కోరిందమ్మ ఉయ్యాలో
తూర్పు రాజులమ్మ ఉయ్యాలో
సీతనడగొచ్చిరి ఉయ్యాలో
విల్లు విరిచిన వారికి ఉయ్యాలో
మా సీతనిస్తాము ఉయ్యాలో
విల్లు విరువలేక ఉయ్యాలో
వారెల్లి పోయిరి ఉయ్యాలో
పడమటి రాజులు ఉయ్యాలో
సీతనడగొచ్చిరి ఉయ్యాలో
విల్లు విరిచిన వారికి ఉయ్యాలో
మా సీతనిస్తాము ఉయ్యాలో
విల్లు విరువలేక ఉయ్యాలో
వారెల్లి పోయిరి ఉయ్యాలో
దక్షిణపు రాజులు ఉయ్యాలో
సీతనడగొచ్చిరి ఉయ్యాలో
విల్లు విరిచిన వారికి ఉయ్యాలో
మా సీతనిస్తాము ఉయ్యాలో
విల్లు విరువ లేక ఉయ్యాలో
వారెల్లి పోయిరి ఉయ్యాలో
ఉత్తర దేశాన ఉయ్యాలో
అయోధ్య నేలేటి ఉయ్యాలో
రఘువంశరాజులు ఉయ్యాలో
సీతనడగొచ్చిరి ఉయ్యాలో
విల్లు విరిచిన వారికి ఉయ్యాలో
మా సీతనిస్తాము ఉయ్యాలో
ఇంతలో రామయ్య ఉయ్యాలో
విల్లు చేతబట్టి ఉయ్యాలో
పటపట విల్లిరిచి ఉయ్యాలో
పడతినే పెండ్లాడె ఉయ్యాలో
శివధనుస్సు విరిచి ఉయ్యాలో
సీతనే పెండ్లాడె ఉయ్యాలో
పెళ్లి వేడుకలన్ని ఉయ్యాలో
జరిపించె జనకుడు ఉయ్యాలో
కాతమామిడి కింద ఉయ్యాలో
కాళ్లనే కడిగించె ఉయ్యాలో
పూతమామిడి కింద ఉయ్యాలో
పుస్తెనే కట్టించె ఉయ్యాలో
ముత్యాల తలంబ్రాలు
ఉయ్యాలో
మురిపెంగ పోయించె
ఉయ్యాలో
పెరుగన్నము పెట్టి ఉయ్యాలో
పెంచుకో రామయ్య ఉయ్యాలో
నెయ్యన్నము పెట్టి ఉయ్యాలో
పెంచుకో రామయ్య ఉయ్యాలో
చద్దన్నమూ పెట్టి ఉయ్యాలో
సాదుకో రామయ్య ఉయ్యాలో
ముక్కోటి దేవతలు ఉయ్యాలో
మక్కువతో దీవించె ఉయ్యాలో
బంగారు రథమెక్కి ఉయ్యాలో
బయలెల్లిపోయిరి ఉయ్యాలో
పయనమై పోయిరి ఉయ్యాలో
పట్టాభిషేకానికి ఉయ్యాలో
పయనమై పోయిరి ఉయ్యాలో
పట్టాభిషేకానికి ఉయ్యాలో.

# మల్లెలు మల్లెలు మల్లెపువ్వులో

మల్లెలు మల్లెలు మల్లెపువ్వులో
మా వూరి కట్టమీద బంతిపువ్వులో – 2
(మల్లెలు మల్లెలు – మల్లెపువ్వులో – 2)
(మా వూరికట్ట మీద – బంతిపువ్వులో – 2)
బంతిపూల బాటలల్లొ రాముడెల్లెనో
రామునెంట రతనాల చిలకలెల్లెనో – 2

మల్లెలు మల్లెలు మల్లెపువ్వులో
మా వూరి కట్టమీద కట్లపువ్వులో – 2
(మల్లెలు మల్లెలు – మల్లెపువ్వులో – 2)
(మా వూరికట్టమీద – కట్లపువ్వులో – 2)
కట్లపూల బాటలల్లొ కృష్ణుడెల్లెనో
కృష్ణునెంట నెమలీక పింఛమెల్లెనో – 2
కట్లపూల బాటలల్లొ – కృష్ణుడెల్లెనో
కృష్ణునెంట నెమలీక పింఛమెల్లెనో– 2
గన్నేరు గన్నేరు జాజిమొగ్గలో
మా వూరి కట్టమీద గునుకపువ్వులో – 2
(గన్నేరు గన్నేరు – జాజిమొగ్గలో – 2)
(మా వూరికట్టమీద – గునుకపువ్వులో – 2)
గునుకపూల దారిలోన – గణపతెల్లెనో –2
గణపయ్య వెంట నడిచి ఎలుక ఎల్లెనో – 2
గునుకపూల దారిలోన – గణపతెల్లెనో –2
గణపయ్య వెంట నడిచి – ఎలుక ఎల్లెనో 2

గుగ్గుమ్మ గుమ్మడి గుమ్మడిపువ్వులో
మా వూరి గుడిముందు శంఖు పువ్వులో – 2
(గుగ్గుమ్మ గుమ్మడి – గుమ్మడిపువ్వులో – 2)
(మా వూరిగుడి ముందు – శంఖు పువ్వులో – 2)
శంఖు పూల వనంలోన – శివుడెల్లెనో –2
శివునెంట నాట్యమాడి నంది వెళ్లెనో – 2
శంఖు పూల వనంలోన – శివుడెల్లెనో –2
శివునెంట నాట్యమాడి – నంది వెళ్లెనో 2
తంగేడు తంగేడు సంద్రపువ్వులో
మా వూరి కట్టమీద రుద్రాక్షలో – 2
(తంగేడు తంగేడు – సంద్రపువ్వులో – 2)
(మా వూరికట్టమీద – రుద్రాక్షలో – 2)
రుద్రాక్షవనంలో రుద్రుడే నడవంగ
రుద్రునెంట పావురాల గుంపులే ఎల్లంగ – 2
రుద్రాక్షవనంలో – రుద్రుడే నడవంగ –2
రుద్రునెంట పావురాల – గుంపులే ఎల్లంగ 2
మల్లెలు మల్లెలు మల్లెపువ్వులో
మా వూరికట్టమీద పత్తిపువ్వులో – 2
(మల్లెలు మల్లెలు – మల్లెపువ్వులో – 2)
(మా వూరికట్టమీద – పత్తిపువ్వులో – 2)
పత్తిపూల బాటలల్లొ పరమాత్ముడెల్లంగ
పరమాత్ముని వెంట పాల చిలకలెల్లెనో – 2

# శ్రీ గౌరి నీ పూజ ఉయ్యాలో

శ్రీ గౌరి నీ పూజ ఉయ్యాలో
చేయబూనితిమమ్మ ఉయ్యాలో
కాపాడు మమ్ముల ఉయ్యాలో
కైలాసరాణీ ఉయ్యాలో
శంకర పార్వతి ఉయ్యాలో
శంభునిరాణి ఉయ్యాలో
శంకర పార్వతి ఉయ్యాలో
శంభునిరాణి ఉయ్యాలో
తల్లి నిన్నెప్పుడూ ఉయ్యాలో
ధ్యానింతుమమ్మ ఉయ్యాలో
కలహంస నడకల ఉయ్యాలో
కలికి రాణివమ్మ ఉయ్యాలో
సింహపీఠంబున ఉయ్యాలో
చెలియకూర్చుండమ్మ
ఉయ్యాలో
బంగారు చెంబుల ఉయ్యాలో
గంగ ఉదకం తెచ్చి ఉయ్యాలో
కాంత నీ పాదాల ఉయ్యాలో
కడిగి తరియింతుము
ఉయ్యాలో
అంబికా నీకిదే ఉయ్యాలో
అర్ఘ్యంబులిచ్చెద ఉయ్యాలో
ఆకాశగంగతో ఉయ్యాలో
ఆదరించుము తల్లి ఉయ్యాలో
జలజాక్షి పందిట ఉయ్యాలో
జలకమాడుమమ్మ ఉయ్యాలో
బంగారు చీరలు ఉయ్యాలో
శాంభవి నీకమ్మ ఉయ్యాలో
జలతారు చీరలు ఉయ్యాలో
అద్దాల రవికలు ఉయ్యాలో
జలతారు చీరలు ఉయ్యాలో
అద్దాల రవికలు ఉయ్యాలో
అద్దాల రవికలు ఉయ్యాలో
అమ్మ నీకిచ్చెద ఉయ్యాలో
నీలకంఠపు రాణి ఉయ్యాలో
నీలవేణి రాణి ఉయ్యాలో
ప్రేమ పువ్వుల మాల
ఉయ్యాలో
నీ కేసి పూజింతు ఉయ్యాలో
జయము నీకు తల్లి ఉయ్యాలో
శుభము మాకు తల్లి ఉయ్యాలో
జయము నీకు తల్లి  ఉయ్యాలో
శుభము మాకు తల్లి ఉయ్యాలో.

# ఇసుకల పుట్టె గౌరమ్మ

ఇసుకల పుట్టె గౌరమ్మ ఇసుకలో పెరిగే గౌరమ్మ
ఇసుకలో వసంతమాడంగా పోయిరా గౌరమ్మ
తీగె తిరుపతి మావిళ్లు పొన్నగంటితళ్లు
పోగలవంటి వనములు
వనముల చిలుకలు గలగల పలికితె
వనమంతా కదిలె గౌరి మేడంతా కదిలె
పసుపులో పుట్టె గౌరమ్మ పసుపులో పెరిగే గౌరమ్మ
పసుపులో వసంతమాడంగా పోయిరా గౌరమ్మ
తీగె తిరుపతి మావిళ్లు పొన్నగంటితళ్లు
పోగలవంటి వనములు
వనముల చిలుకలు గలగల పలికితె
వనమంతా కదిలె గౌరి మేడంతా కదిలె
కుంకుమలో పుట్టె గౌరమ్మ కుంకుమలో పెరిగే
గౌరమ్మ
కుంకుమలో వసంతమాడంగా పోయిరా గౌరమ్మ
తీగె తిరుపతి మావిళ్లు పొన్నగంటితళ్లు
పోగలవంటి వనములు
వనముల చిలుకలు గలగల పలికితె
వనమంతా కదిలె గౌరి మేడంతా కదిలె
గంధంలో పుట్టె గౌరమ్మ గంధంలో పెరిగే గౌరమ్మ
గంధంలో వసంతమాడంగా పోయిరా గౌరమ్మ
తీగె తిరుపతి మావిళ్లు పొన్నగంటితళ్లు
పోగలవంటి వనములు
వనముల చిలుకలు గలగల పలికితె
వనమంతా కదిలె గౌరి మేడంతా కదిలె.

# నీరాటి సందున ఉయ్యాలో

నీరాటి సందున ఉయ్యాలో
నిమ్మచెట్టు మొలిచె ఉయ్యాలో
నిమ్మెంట మిలిచింది ఉయ్యాలో
నిలువని వానలు ఉయ్యాలో
ఆకంటు పెట్టింది ఉయ్యాలో
అత్తరు వాసనలు ఉయ్యాలో
చిగురంటు వేసింది ఉయ్యాలో
చిత్రము వర్ణాలు ఉయ్యాలో
మొగ్గంటు వెట్టింది ఉయ్యాలో
మొగిలిపూలా
వాసన ఉయ్యా లో
పువ్వంటు
పూసింది ఉయ్యాలో
బుక్కా వాసనలు ఉయ్యాలో
పిందంటు పెట్టింది ఉయ్యాలో
బిందే సక్కదనం ఉయ్యాలో
కాయంటు కాసింది ఉయ్యాలో
కడవా సక్కదనం ఉయ్యాలో
పండంటు పండింది ఉయ్యాలో
పండు తెప్పించి ఉయ్యాలో
చిక్కములో పెట్టి ఉయ్యాలో
భోనగరిగి అంగట్లో ఉయ్యాలో
బొడ్డే వేయించి ఉయ్యాలో
సిద్దిపేట అంగట్ల ఉయ్యాలో
శీలలే వేయించి ఉయ్యాలో
ఇది మా అక్కకు ఉయ్యాలో
ఇచ్చిరావే చిలక ఉయ్యాలో
చిన్ననాటి నుండి ఉయ్యాలో
తల్లిదండ్రులు లేరు ఉయ్యాలో
నా తోడ పుట్టింది ఉయ్యాలో
నా అక్క ఒక్కతే ఉయ్యాలో
ఆటపటలతో పెంచె ఉయ్యాలో
ఆత్మ గల్లా అక్క ఉయ్యాలో
ఇచ్చి వస్తం గాని ఉయ్యాలో
ఇల్లెరుగా మమ్మ ఉయ్యాలో
పోయి వస్తంగాని ఉయ్యాలో
పొయ్యెరుగా
మమ్మ ఉయ్యాలో
పొంగ వారిల్లు ఉయ్యాలో
లక్క మేడళ్లు ఉయ్యాలో
దూరాన వారిళ్లు ఉయ్యాలో
చుట్టు దూలాలు ఉయ్యాలో
ఆకాశమంచున ఉయ్యాలో
అద్దాల మేడలు ఉయ్యాలో
ఆ మేడల చుట్టు ఉయ్యాలో
అందాల తోటలు ఉయ్యాలో
నిండైన కోనేర్లు ఉయ్యాలో
పారిజాతా పూలు ఉయ్యాలో
మెరిసేటి రథములు ఉయ్యాలో
మేలైన గుర్రాలు ఉయ్యాలో
చుట్టూతా
బురుజులు ఉయ్యాలో
ఎత్తైన గోడలు ఉయ్యాలో
అరుగు మీద అక్క ఉయ్యాలో
అచ్చనాలడంగ ఉయ్యాలో
పందిట్ల మా బావ ఉయ్యాలో
పద్యాలు చెప్పు ఉయ్యాలో
వారిని మీరెరిగి ఉయ్యాలో
ఓ పక్షులారా ఉయ్యాలో
అక్కకు పండ్లిచ్చి ఉయ్యాలో
కశలమా అడగరే ఉయ్యాలో
అప్పుడు పక్షులు ఉయ్యాలో
ఆ రామ చిలుకలు ఉయ్యాలో
రివ్వుమని ఎగిరెను ఉయ్యాలో
ఆకాశమార్గానా ఉయ్యాలో
చిన్నంగా పెరిగిన ఉయ్యాలో
చిట్టడవులు దాటి ఉయ్యాలో
దట్టంగా పెరిగినా ఉయ్యాలో
దండి అడవులు
దాటి ఉయ్యాలో
అడ్డంగా నిలిచిన ఉయ్యాలో
వాలు కొండలు దాటి ఉయ్యాలో
నిలువుగా పెరిగిన ఉయ్యాలో
నీలగిరులు దాటి ఉయ్యాలో
చేప్పిన జాడకు ఉయ్యాలో
చేరెను చిలక ఉయ్యాలో
తెచ్చిన పండ్లిచ్చి ఉయ్యాలో
తొడమీద వాలింది ఉయ్యాలో
ఇంత తియ్యని పండ్లు
ఉయ్యాలో
పంపింది ఎవరమ్మ ఉయ్యాలో
ఇంత చక్కని పండ్లు ఉయ్యాలో
ఇచ్చింది ఎవరమ్మ ఉయ్యాలో
నీతోడ పుట్టింది ఉయ్యాలో
నిన్నే పోలింది ఉయ్యాలో
దేవగిరి పట్నాన ఉయ్యాలో
పండిన తోటల్ల ఉయ్యాలో
మేలైన పండ్లమ్మ ఉయ్యాలో
మీ చెల్లె పంపింది ఉయ్యాలో.

# తమ్మళ్ళ వంతలో కోల్

తమ్మళ్ళ వంతలో కోల్
తల వంచుకుని కోల్
నేను పోత కిష్టమ్మ కోల్
బావి నీళ్ళకు కోల్
బావి నీళ్ళ కడవ కోల్
బంగారు కడవ కోల్
మంచినీళ్ళ మునగాలె కోల్
ముత్యాల కడవ కోల్
వంచిన వంగదు కోల్
వజ్రాల కడవ కోల్
కడవ పట్టుకుని కోల్
నీళ్ళ కెళ్ళినాది కోల్
బుడుగు బుడుగున మునిగి కోల్
మోకాలు వెంటి కోల్
చెలియకు లేవాది కోల్
చెయ్యెత్తి కడవ కోల్
అటు చూసి ఇటు చూసి కోల్
కట్టపొంటి చూసే కోల్
కట్టపొంటి పొయ్యేటి కోల్
అన్నయ్య ఎవరు కోల్
నేనొచ్చి జామాయే కోల్
కడవెత్తి పోమా కోల్
కడవ పేరు చెప్పంది కోల్
నేనెత్త కడవ కోల్
కడవ పేరు కస్తూరి కోల్
నా పేరు గంగమ్మ కోల్
ఇంటి పేరు చెప్పంది కోల్
కడవెత్తలేను కోల్
ఇంటి పేరు ఇప్ప కోల్
అమ్మ పేరు హంస కోల్
మారు పేరు చెప్పంది కోల్
నేనెత్త కడవ కోల్
మారు పేరు ఎలుగుమార్ల కోల్
మేనకోడలును నేను కోల్
గోత్రం చెప్పంది కోల్

నేనెత్త కడవ కోల్
కోటలో ఉన్నట్టి కోల్
గొంతి కోడలును కోల్
అన్నాలెంతమంది కోల్
వనితరో నీకు కోల్
నీ తోటి నలుగురు కోల్
నీలవర్ణుడా కోల్
మగువరో నీ వారు కోల్
మంచివారేనా కోల్
ధర్మరాజు వంటి కోల్
మగడు మా వారు కోల్
కడవెత్తి మాధవుడు కోల్
కంటనీరు తీసె కోల్
మా యింటి కొస్తావా కోల్
చీర పెడ్తా నీకు కోల్
మా వాళ్ళు లేనోళ్ళు కోల్
వారికేమి లేదు కోల్
చీరె సారెలు నాకు కోల్
పెట్టలేదే అన్నా కోల్
పత్తి చేలు వేస్తే కోల్
పైకి వస్తారు కోల్
అప్పుడు వారంతా కోల్
కట్నాలు పెడుదురూ కోల్
ఆ నుంచి ఆ చెల్లె కోల్
ఇంటికొచ్చినాది కోల్
అన్నరో ఓయన్న కోల్
అన్నా పెద్దన్నా కోల్
పత్తి చేలు వేస్తే కోల్
పైకి వస్తారంట కోల్
పత్తి చేలమీద కోల్
చల్లిరాంద్రన్న కోల్
మొలచిందో మొలవలేదో కోల్
చూసి రాంద్రన్నా కోల్
గోధుమ్మ మొలిచింది కోల్
గోడ కొరికింది కోల్

పజ్జొన్న మొలిచింది కోల్
సామమొలిచింది కోల్
కొట్టెటోళ్ళు లేక కోల్
కొండలయ్యి పెరిగింది కోల్
కోయించు నాయన్నా కోల్
కొడుకుల్లా చేతా కోల్
కట్టించు నాయన్నా కోల్
కర్రెడ్ల బంతి కోల్
చెరిగెటోళ్ళు లేక కోల్
చెదలెక్కి పాయె కోల్
చెరిగించు నాయన్నా కోల్
చెల్లెండ్ల చేత కోల్
మలిచెటోళ్ళు లేక కోల్
మన్నాయి పాయే కోల్
మలిపించు నాయన్నా కోల్
మరదళ్ళ చేత కోల్
కొలిచేటోళ్ళు లేక కోల్
కొండలాయే రాశి కోల్
కోలిపించు నాయన్న కోల్
కోడళ్ళ చేత కోల్
కొలిచేటోళ్ళు లేక కోల్
కొండలాయే రాశి కోల్
కొలిపించు నాయన్నా కోల్
కొడుకుల్లా చేత కోల్
నాలుగు పుట్లు కొలువంగ కోల్
నడుము చెమటెక్కె కోల్
పది పుట్లు కొలువంగా కోల్
పక్కలు చెమటెక్కె కోల్
వేయి పుట్లు కొలువంగా కోల్
వెన్ను చెమటెక్కె కోల్
పది వేల పెట్టెల్లో కోల్
ధనము నింపారు కోల్
అన్నల సంపదలు కోల్
చెల్లెకు సౌభాగ్యం కోల్.

# అక్కమ్మ కథ

హరిహరి ఓ రామ ఉయ్యాలో
అయోధ్యరామ ఉయ్యాలో
హరి అన్నవారికి ఉయ్యాలో
అవధులు లేవు ఉయ్యాలో
తలమీద సూర్యుడా ఉయ్యాలో
దండమోయీ నీకు ఉయ్యాలో
ఇక్కడి సుద్దులు ఉయ్యాలో
ఇట్లనే ఉందనీ ఉయ్యాలో
అక్కడి సుద్దులు ఉయ్యాలో
ఏమేమి ఉండును ఉయ్యాలో
పెదరాజు పట్నంలో ఉయ్యాలో
పెదరాసి పెద్దుకు ఉయ్యాలో
ఎందరు కొడుకులు ఉయ్యాలో
ఎందరెక్కడిదమ్మ ఉయ్యాలో
ఏడుగురు కొడుకులు
ఉయ్యాలో
ఏడుగురి తోడన ఉయ్యాలో
ఒక్కతె అక్కమ్మ ఉయ్యాలో
మండోలు పట్నాన ఉయ్యాలో
మనువునిచ్చినారు ఉయ్యాలో
అక్కను మనువిచ్చి ఉయ్యాలో
పన్నెండు ఏండ్లాయె ఉయ్యాలో
తొలిసారె పెట్టలె ఉయ్యాలో
తోలుకురాలేదు ఉయ్యాలో
మలిసారె పెట్టలె ఉయ్యాలో
మల్లమల్ల లేదు ఉయ్యాలో
అటుకాలేకాని ఉయ్యాలో
ఇటుకాలు లేదు ఉయ్యాలో
ఎనలేని పండుగ ఉయ్యాలో
ఏడొద్దులుండె ఉయ్యాలో

బతుకమ్మ పండుగ ఉయ్యాలో
పదొద్దులుండె ఉయ్యాలో
బతుకమ్మ పండుగ ఉయ్యాలో
అవ్వగారాడల్ల ఉయ్యాలో
ఒక్కతే అక్కమ్మ ఉయ్యాలో
అత్తగారాడల్ల ఉయ్యాలో
సాలే సంగల్లు ఉయ్యాలో
ఏమంటున్నారు ఉయ్యాలో
వాళ్ల తల్లి పెద్దుకు ఉయ్యాలో
యాది రాలేదేమో ఉయ్యాలో
వాళ్లన్న రామునికి ఉయ్యాలో
యాది రాలేదేమో ఉయ్యాలో
ఆడపిల్లా లేంది ఉయ్యాలో
పువ్వు తెంపరాదు ఉయ్యాలో
పువ్వు తెంపిన గాని ఉయ్యాలో
పుణ్యమే కాదు ఉయ్యాలో
ఇట్లాంటి మాటలు ఉయ్యాలో
అంటనే ఉన్నారు ఉయ్యాలో
ఎనలేని పండుగలు ఉయ్యాలో
ఏడొద్దులుండె ఉయ్యాలో
బతుకమ్మ పండుగ ఉయ్యాలో
పదొద్దులుండె ఉయ్యాలో
పిల్లలకు వచ్చింది ఉయ్యాలో
ప్రీతి బొడ్డెమ్మ ఉయ్యాలో
బాలకు వచ్చింది ఉయ్యాలో
బతుకమ్మ పండుగ ఉయ్యాలో
మొగోళ్లకు వచ్చింది ఉయ్యాలో
మొగులంత పండుగ ఉయ్యాలో
వాళ్లంత మంది ఉయ్యాలో
అంటనే ఉన్నారు ఉయ్యాలో

విన్నారె మాటలు ఉయ్యాలో
ఎవరు విన్నారు ఉయ్యాలో
రచ్చాల రాముడు ఉయ్యాలో
రాముడే విన్నాడు ఉయ్యాలో
రాసేటి రాతలు ఉయ్యాలో
సాలుజేసినాడు ఉయ్యాలో
ఎక్కెక్కి మేడలు ఉయ్యాలో
ఎక్కిపోయినాడు ఉయ్యాలో
దిక్కయి మేడలు ఉయ్యాలో
దిగివచ్చినాడు ఉయ్యాలో
ఆడికెల్లి రాముడు ఉయ్యాలో
ఇంటికెళ్లినాడు ఉయ్యాలో
అమ్మలగన్న తల్లి ఉయ్యాలో
మముగన్నతల్లి ఉయ్యాలో
వింటావ ఓ మాట ఉయ్యాలో
విలువైన మాట ఉయ్యాలో
చెప్తా ఓ తల్లి ఉయ్యాలో
చెవునన్నబెట్టు ఉయ్యాలో
ఈ పొద్దు నే పోదు ఉయ్యాలో
రేపు నేనొద్దును ఉయ్యాలో
వద్దొద్దు రామన్న ఉయ్యాలో
నా బుద్దులు విను ఉయ్యాలో
అక్కమ్మను ఇచ్చి ఉయ్యాలో
పన్నెండేండ్లాయె ఉయ్యాలో
తొలిసారె పెట్టలె ఉయ్యాలో
తోలుకు రాలేదు ఉయ్యాలో
మలిసారె పెట్టలె ఉయ్యాలో
మల్లమల్ల లేదు ఉయ్యాలో
అటుకాలే కాని ఉయ్యాలో
ఇటుకాలు లేదు ఉయ్యాలో

వద్దురా రామన్న ఉయ్యాలో
నా బుద్ధులు విను ఉయ్యాలో
ఈడున్న పండుగ ఉయ్యాలో
ఆడలేదా రామ ఉయ్యాలో
ఈడున్న బతుకమ్మ ఉయ్యాలో
ఆడలేదా రామ ఉయ్యాలో
ఈడున్న బట్టలు ఉయ్యాలో
ఆడలేవా చెప్పు ఉయ్యాలో
వద్దన్న పోయెను ఉయ్యాలో
పొమ్మన్న పోయెను ఉయ్యాలో
అంతలో రామన్న ఉయ్యాలో
అంటనే ఉన్నాడు ఉయ్యాలో
అప్పుడు అక్కమ్మ ఉయ్యాలో
ఏమి చేసినాది ఉయ్యాలో
అక్కమ్మ అత్తింట ఉయ్యాలో
ఏమి చేస్తున్నాది ఉయ్యాలో
వేగివేగిన లేచి ఉయ్యాలో
వేయి పనులు చేసి ఉయ్యాలో
పొచిల్లు ఊడ్చింది ఉయ్యాలో
వాకిళ్లు ఊడ్చింది ఉయ్యాలో
ధరణి యెతల్లికి ఉయ్యాలో
దట్టంగ చల్లింది ఉయ్యాలో
భూమ్మీద తల్లికి ఉయ్యాలో
బుగ్గన సల్లింది ఉయ్యాలో
అలికి పూతలు పూసి ఉయ్యాలో
ముగ్గులు పెట్టింది ఉయ్యాలో
నిప్పు రాజేసింది ఉయ్యాలో
నీళ్లు వేడిబెట్టె ఉయ్యాలో
అప్పుడు అక్కమ్మ ఉయ్యాలో
జలకమాడినాది ఉయ్యాలో
తడి వస్త్రములు విడిచి
ఉయ్యాలో
పొడి వస్త్రములు కట్టి ఉయ్యాలో
పొయిమీద పిడకేసి ఉయ్యాలో
బోనమెసరు పెట్టి ఉయ్యాలో
సందున ఏరెను ఉయ్యాలో
సంపంగి పూలను ఉయ్యాలో
గొందిళ్ల ఏరెను ఉయ్యాలో
కొన్ని కూరలు ఉయ్యాలో
బియ్యంల వడ్లేరి ఉయ్యాలో
వడ్లల్ల బోసి ఉయ్యాలో
నిప్పుల్ల ఉడికేను ఉయ్యాలో
నల్లని వంకాయ ఉయ్యాలో
తేలుతూ ఉడికేను ఉయ్యాలో
తెల్లని వంకాయ ఉయ్యాలో
చిటచిట ఉడికేను ఉయ్యాలో
చిక్కుడు కాయ ఉయ్యాలో
పొటపొట ఉడికేను ఉయ్యాలో
పొట్లాయికాయ ఉయ్యాలో
గుడగుడ ఉడికేను ఉయ్యాలో
గుమ్మడికాయ ఉయ్యాలో
డెబ్బయి కూరలు ఉయ్యాలో
రెండు పాలు పెరుగులు
ఉయ్యాలో
అరవయి కూరలు ఉయ్యాలో
అల్లము తొక్కులు ఉయ్యాలో
చుట్టుముట్టు కూరలు
ఉయ్యాలో
నడుమ అన్నము ఉయ్యాలో
నడుమనే అన్నము ఉయ్యాలో
నల్ల ఆవుల పెరుగు ఉయ్యాలో
చక్కని అక్కమ్మ ఉయ్యాలో
పని ఎంత ఇగురమె ఉయ్యాలో
కొండంత మొగులొచ్చె
ఉయ్యాలో
చాటోలె తెప్పొచ్చె ఉయ్యాలో
తూరుపు దేశాన ఉయ్యాలో
తులసివాన కొట్టె ఉయ్యాలో
ఆ వాన ఈ వాన ఉయ్యాలో
దండివాన కొట్టె ఉయ్యాలో
చెరువు నిండిపోయె ఉయ్యాలో
కట్టలే తెగిపాయె ఉయ్యాలో
కట్టకు హారము ఉయ్యాలో
ఎవరినిస్తవు రాజ ఉయ్యాలో
పెద్ద కొడుకునన్న ఉయ్యాలో
ఇయ్యవయ్య రాజ ఉయ్యాలో
పెద్ద కొడుకునిస్తె ఉయ్యాలో
పేరుకు నా కెవరు ఉయ్యాలో
చిన్న కొడుకునన్న ఉయ్యాలో
ఇయ్యవయ్య రాజ ఉయ్యాలో
చిన్న కొడుకుకన్న ఉయ్యాలో
ప్రీతి నాకెవ్వరు ఉయ్యాలో
నడిపి కొడుకునన్న ఉయ్యాలో
ఇయ్యవయ్య రాజ ఉయ్యాలో
నడిపి కొడుకునిస్తె ఉయ్యాలో
నాకెవ్వరుంటారు ఉయ్యాలో
పెద్ద కోడలునన్న ఉయ్యాలో
ఇయ్యవయ్య రాజ ఉయ్యాలో
పెద్ద కోడలునిస్తె ఉయ్యాలో
పేరు కెవ్వరు లేరు ఉయ్యాలో
నడిపి కోడలునన్న ఉయ్యాలో
ఇయ్యవయ్య రాజ ఉయ్యాలో
నడిపి కోడలినిస్తె ఉయ్యాలో
ఇంటికి దిక్కెవరు ఉయ్యాలో
చిన్న కోడలునన్న ఉయ్యాలో
ఇయ్యవయ్య రాజ ఉయ్యాలో

చిన్న కోడలైతె ఉయ్యాలో
నాకు చింతలేదు ఉయ్యాలో
ఆ చిన్న కోడలు ఉయ్యాలో
చక్కని అక్కమ్మ ఉయ్యాలో
చిన్న కోడలున్న ఉయ్యాలో
చెంతకు చేరిండె ఉయ్యాలో
వెళ్లిన ఆ రాజు ఉయ్యాలో
ఏమని అంటుండె ఉయ్యాలో
అక్కమ్మను పిలిచి ఉయ్యాలో
ఆ రాజు అంటుండు ఉయ్యాలో
పెట్టెల్లొ పట్టు చీర ఉయ్యాలో
కట్టుకో అక్కమ్మ ఉయ్యాలో
పెట్టెల్లొ సొమ్ములు ఉయ్యాలో
పెట్టుకో అక్కమ్మ ఉయ్యాలో
అప్పుడె పెట్టుకున్న ఉయ్యాలో
ఓ మామగారు ఉయ్యాలో
రవికలు తొడగవె ఉయ్యాలో
ఓ చిన్నినాగ ఉయ్యాలో
నిండుగ బిందెల్ల ఉయ్యాలో
నీళ్లనే తేవమ్మ ఉయ్యాలో
బిడ్డకు పాలిచ్చి ఉయ్యాలో
బయలెల్లె అక్కమ్మ ఉయ్యాలో
బాపనక్కల్లార ఉయ్యాలో
నీళ్లకొస్తారమ్మ ఉయ్యాలో
కోమటక్కల్లార ఉయ్యాలో
నీళ్లకొస్తారమ్మ ఉయ్యాలో
అప్పుడే తెచ్చినం ఉయ్యాలో
అదిగో బిందెలు ఉయ్యాలో
సాలే అక్కల్లార ఉయ్యాలో
నీళ్లకొస్తారమ్మ ఉయ్యాలో
అప్పుడే తెచ్చినం ఉయ్యాలో
అదిగో బిందెలు ఉయ్యాలో

తెనుగు అక్కల్లార ఉయ్యాలో
నీళ్లకొస్తారమ్మ ఉయ్యాలో
గొల్ల అక్కల్లార ఉయ్యాలో
నీళ్లకొస్తారమ్మ ఉయ్యాలో
అప్పుడే తెచ్చినం ఉయ్యాలో
అదిగో బిందెలు ఉయ్యాలో
అక్కమ్మ ఒక్కతె ఉయ్యాలో
నీళ్లకు బయలెల్లె ఉయ్యాలో
చెరువు దగ్గరికెళ్లె ఉయ్యాలో
అక్కమ్మ ఒక్కతె ఉయ్యాలో
మెట్టుమెట్టు దిగి ఉయ్యాలో
నీళ్లల్ల దిగిందె ఉయ్యాలో
మోకాళ్ల మంటొచ్చె ఉయ్యాలో
బిందె మునుగుత లేదు
ఉయ్యాలో
ఆచంట పోరాదే ఉయ్యాలో
నా చిన్నినాగ ఉయ్యాలో
నడుమంట నీళ్లొచ్చె ఉయ్యాలో
బిందె మునుగుత లేదు
ఉయ్యాలో
ఆచంట పోరాదె ఉయ్యాలో
నా చిన్నినాగ ఉయ్యాలో
కుతికెల్ల మంటొచ్చె ఉయ్యాలో
బిందె మునుగుత లేదు
ఉయ్యాలో
ఆచంట పోరాదె ఉయ్యాలో
నా చిన్నినాగ ఉయ్యాలో
ఆకాశమార్గాన ఉయ్యాలో
ఎగిరె పక్షుల్లారా ఉయ్యాలో
తొట్లెలున్న బిడ్డకు ఉయ్యాలో
తల్లి లేదని చెప్పు ఉయ్యాలో
తెల్లని గుంపుల ఉయ్యాలో

ఓ కొంగలార ఉయ్యాలో
ఆటాడె బిడ్డకు ఉయ్యాలో
అమ్మ లేదని చెప్పు
అక్కమ్మ ప్రాణము ఉయ్యాలో
ఆరము కట్టకు ఉయ్యాలో
దేవతై అక్కమ్మ ఉయ్యాలో
కాపాడె కట్టను ఉయ్యాలో
ఆ తల్లిత్యాగము ఉయ్యాలొ
ఎల్లరు తలచేరు ఉయ్యాలో
దేవతై అక్కమ్మ ఉయ్యాలో
కాపాడె కట్టను ఉయ్యాలో
ఆ తల్లి త్యాగము ఉయ్యాలో
ఎల్లరు తలచేరు ఉయ్యాలో.

# వరమున పుట్టింది ఉయ్యాలో

వరలక్ష్మి దేవికి చందమామ
తల్లియు తండ్రియు చందమామ
ఆ తల్లిదండ్రులకు చందమామ
ఏడుగురు దాసీలు చందమామ
ఏడుగురు దాసీలను చందమామ
వెంటబెట్టుకొని చందమామ
పాయెనే వరలక్ష్మి చందమామ
పూలజాడలకు చందమామ
గుండ్రంగ పూసినవి చందమామ
గుమ్మడి పూలు చందమామ
కనువిందుగా పూసె చందమామ
కట్లాయి పువ్వులు చందమామ
పొందుగా పూసినవి చందమామ
పొట్లాయి పువ్వులు చందమామ
కొమ్మల్లో పూసినవి చందమామ
గోరెం పువ్వులు చందమామ
ఆకల్లో పూసినవి చందమామ
రుద్రాక్షపూలు చందమామ
పూలన్ని కోసి చందమామ
బుట్టల్లో నింపి చందమామ
వచ్చెనే వరలక్ష్మి చందమామ
ఆడుతూ పాడుతూ చందమామ
బంగారు పళ్లెంలో చందమామ
పేర్చెనే బతుకమ్మ చందమామ
పాల బొమ్మల నడుమ
చందమామ
బంగారు బొట్టు చందమామ
కురచబొమ్మల నడుమ
చందమామ
కుంకమ బొట్టు చందమామ

వెండి దువ్వెన తోను చందమామ
వెలది చిక్కు తీసి చందమామ
పైడి దువ్వెన తోను చందమామ
పాపిట తీసింది చందమామ
పాపిట్ల పొందుగా చందమామ
బంతుల మరించెనూ చందమామ
రాగి వెంట్రుకల్లో చందమామ
రతనాలు నింపు చందమామ
కొంగున బంగారు చందమామ
చీరనే కట్టింది చందమామ
నీలి రంగు చీర చందమామ
నల్లంచు రవిక చందమామ
నడుముకు ఒడ్డానము
చందమామ
నాగిరిబిళ్ల చందమామ
నాలుగు పేటల గొలుసు
చందమామ
నల్లపూసల దండ చందమామ
కాళ్లకు పట్టీలు చందమామ
కడియాల జోడు చందమామ
పగడంపు కమ్మలు చందమామ
పాపెట సేరు చందమామ
ముత్యాల పేరు చందమామ
ముద్దుటుంగరము చందమామ
చేతికి గాజులు చందమామ
చేమంతి పూలు చందమామ
వెండివి కోలలు చందమామ
పైడివీ గజ్జెలూ చందమామ
పసుపు కుంకమలు చందమామ
పూలు పండ్లు చందమామ

అటుకులూ పుట్నాలు చందమామ
అరిసెలు లడ్డూలు చందమామ
పెసరి లడ్డూలు చందమామ
పెరుగన్నము చందమామ
చెలికత్తెలతో కూడి చందమామ
చెలియలందరిని పిలిచి
చందమామ
పాయెనే వరలక్ష్మి చందమామ
బతుకమ్మ లాటకు చందమామ.

# రామ రామ రామ ఉయ్యాలో

రామ రామ రామ ఉయ్యాలో
రామనే శ్రీరామ ఉయ్యాలో
రామ రామానంది ఉయ్యాలో
రాగమెత్తరాదు ఉయ్యాలో
హరిహరియా రామ ఉయ్యాలో
హరియా బ్రహ్మదేవ ఉయ్యాలో
హరి అన్న వారికి ఉయ్యాలో
ఆపదలూ రావు ఉయ్యాలో
శరణన్న వారికి ఉయ్యాలో
మరణంబు లేదు ఉయ్యాలో
రామ రామ రామ ఉయ్యాలో
రామనే శ్రీరామ ఉయ్యాలో
ముందుగా నిను తల్తు ఉయ్యాలో
ముత్యాల పోశమ్మ ఉయ్యాలో
తర్వాత నిను దల్తు ఉయ్యాలో
తల్లిరో పెద్దమ్మ ఉయ్యాలో
ఆదిలో నిను దల్తు ఉయ్యాలో
అయిలోని మల్లన్న ఉయ్యాలో
కోరుతా నిను దల్తు ఉయ్యాలో
కొమురెల్లి మల్లన్న ఉయ్యాలో
మారుగా నిను దల్తు ఉయ్యాలో
మావురాల ఎల్లమ్మ ఉయ్యాలో
భోగాన నిను దల్తు ఉయ్యాలో
బొంతపల్లి ఈరన్న ఉయ్యాలో
శరనన్న వరంగల్లు ఉయ్యాలో
శంభుడా నిను దల్తు ఉయ్యాలో
రామ రామ రామ ఉయ్యాలో
రామనే శ్రీరామ ఉయ్యాలో
శ్రీరామ జయరామ ఉయ్యాలో
అయోధ్య రామ ఉయ్యాలో
తొక్కుదునా భూదేవి ఉయ్యాలో
మొక్కుదునే నిన్ను ఉయ్యాలో
బాధల్ల నిను దల్తు ఉయ్యాలో
భద్రాద్రి రామన్న ఉయ్యాలో
గుండెల్లో నిను దల్తు ఉయ్యాలో
కొండగట్టు అంజన్న ఉయ్యాలో
ఎప్పుడూ నిను దల్తు ఉయ్యాలో
ఎములాడ రాజన్న ఉయ్యాలో
యాదిలో నిను దల్తు ఉయ్యాలో
యాదగిరి నర్సన్న ఉయ్యాలో
సింతల్ల మిము దల్తు ఉయ్యాలో
సమ్మక్క సారక్క ఉయ్యాలో
కీర్తిగా నిను దల్తు ఉయ్యాలో
కీసర రామన్నా ఉయ్యాలో
రామ రామ రామ ఉయ్యాలో
రామనే శ్రీరామ ఉయ్యాలో
శ్రీరామ జయరామ ఉయ్యాలో
కోదండరామ ఉయ్యాలో
అందరినీ తలిచి ఉయ్యాలో
గంగ నిన్ను మరిచి ఉయ్యాలో
గంగ నిలు తలవంది ఉయ్యాలో
ఘడియ నిలువ లేము ఉయ్యాలో
మోతుకు చెట్టు కింద ఉయ్యాలో
పుట్టినావే గంగ ఉయ్యాలో
మొలమంటి కాలువాలు
ఉయ్యాలో
పారినావె గంగ ఉయ్యాలో
తంగేడు చెట్టుకింద ఉయ్యాలో
పుట్టినావే గంగ ఉయ్యాలో
తల్లేడు కాలువలు ఉయ్యాలో
పారినావే గంగ ఉయ్యాలో
జిల్లేడు చెట్టుకింద ఉయ్యాలో
పుట్టీనావే గంగ ఉయ్యాలో
జిలా జిలా కాలువలు ఉయ్యాలో
పారినావే గంగ ఉయ్యాలో
ఊడుగు చెట్టు కింద ఉయ్యాలో
పుట్టినావే గంగ ఉయ్యాలో
ఉరుము ఉరిమి కాలువలు
ఉయ్యాలో
పారినావే గంగ ఉయ్యాలో
కట్టినావు గంగ ఉయ్యాలో
పట్టంచు చీరలు ఉయ్యాలో
తొడిగినావు గంగ ఉయ్యాలో
ముత్యాల రవికెలు ఉయ్యాలో
పూసినావు గంగ ఉయ్యాలో
పుట్టెడు భండారు ఉయ్యాలో
పెట్టినావు గంగ ఉయ్యాలో
భేరి కుంకుమ ఉయ్యాలో
కట్టినావు గంగ ఉయ్యాలో
గవ్వల మండోలు ఉయ్యాలో
గంగ నువ్వు లేక ఉయ్యాలో
ఘడియ నిలువ లేము ఉయ్యాలో
గంగ నీకు శరణు ఉయ్యాలో
తల్లి నీకు శరణు ఉయ్యాలో.

# కాశీలో కలదమ్మ ఉయ్యాలో

కాశిలో కలదమ్మ ఉయ్యాలో
కలవారి ఇల్లు ఉయ్యాలో
కలవారి ఇంట్లో ఉయ్యాలో
పదివేల ఆవులు ఉయ్యాలో
ఆవులు మేతకు ఉయ్యాలో
అడవికి పోయె ఉయ్యాలో
ఆకుచెట్లు దాటి ఉయ్యాలో
తోటల్లు దాటి ఉయ్యాలో
పోకచెట్లు దాటి ఉయ్యాలో
పొన్నల్లు దాటి ఉయ్యాలో
కూసుండి కోసేటి ఉయ్యాలో
కూరమళ్లు దాటి ఉయ్యాలో
వంగి కోసేటి ఉయ్యాలో
వరిమళ్లు దాటి ఉయ్యాలో
మంద నిడిసినాది ఉయ్యాలో
దారి తప్పినాది ఉయ్యాలో
చిట్టడవి దాటింది ఉయ్యాలో
కారడవి దాటింది ఉయ్యాలో
పోయెనే గంగావు ఉయ్యాలో
పులి ఉన్నా దాపు ఉయ్యాలో
పులి గంగిగోవును ఉయ్యాలో
తానురిమి చూసెను ఉయ్యాలో
మింగుతా గంగావు ఉయ్యాలో
మింగుతానే నిన్ను ఉయ్యాలో
మింగితే మింగితివి ఉయ్యాలో
పులిరాజా కాని ఉయ్యాలో
గడువియ్యి ఒక పూట ఉయ్యాలో
గడువియ్యావయ్యా ఉయ్యాలో
లేక లేక బుట్టె ఉయ్యాలో
నా కొక్క బిడ్డ ఉయ్యాలో

బిడ్డకు పాలిచ్చి ఉయ్యాలో
వేగిరం వచ్చెద ఉయ్యాలో
మంచి సుద్దులు చెప్పి ఉయ్యాలో
మరలి నేవచ్చెద ఉయ్యాలో
మళ్లి వస్తానయ్య ఉయ్యాలో
నా మాట నమ్ము ఉయ్యాలో
అమ్మమీద తోడు ఉయ్యాలో
అగ్గి తోడయ్య ఉయ్యాలో
వాయుదేవుని తోడు ఉయ్యాలో
వర్షమ్ము తోడు ఉయ్యాలో
నా కొడుకు తోడయ్య ఉయ్యాలో
మళ్లీ వస్తాను ఉయ్యాలో
కొడుకు మీదొట్టంటే ఉయ్యాలో
కరిగింది పులిరాజు ఉయ్యాలో
గంగిగోవు మాట ఉయ్యాలో
విన్నది పులిరాజు ఉయ్యాలో
పోయిరా గంగావు ఉయ్యాలో
పోయి రావమ్మా ఉయ్యాలో
సందేళ్ల పొద్దాయె ఉయ్యాలో
అమ్మసడి లేదాయె ఉయ్యాలో
అన్ని ఆవులొచ్చె ఉయ్యాలో
అమ్మసడి లేదాయె ఉయ్యాలో
తిరిగొచ్చె మందలూ ఉయ్యాలో
గంగావు రాదాయె ఉయ్యాలో
ముందొచ్చె ఆవుల్లారా ఉయ్యాలో
ముని ఆవుల్లారో ఉయ్యాలో
మాయమ్మ చూతురే ఉయ్యాలో
మాయమ్మ లారా ఉయ్యాలో
ఓ చిన్న లేగమ్మ ఉయ్యాలో
ఓ చిట్టి దూడ ఉయ్యాలో

మీ యమ్మ పులితోను ఉయ్యాలో
బాస చేసినాది ఉయ్యాలో
నడుమచ్చె ఆవుల్లారా
నల్లావుల్లారా ఉయ్యాలో
మాయమ్మ చూతురే ఉయ్యాలో
మాయమ్మలారా ఉయ్యాలో
మీ యమ్మ పులితోను ఉయ్యాలో
బాస చేసినాది ఉయ్యాలో
పులిరాజు నొప్పించి ఉయ్యాలో
వచ్చెను గంగావు ఉయ్యాలో
వేగిరమున వచ్చి ఉయ్యాలో
దొడ్లోకి చేరింది ఉయ్యాలో
చిన్న లేగను చూసి ఉయ్యాలో
చింతలే చేసింది ఉయ్యాలో
ముద్దు బసవన్నను ఉయ్యాలో
మురిపెంగా ముద్దాడె ఉయ్యాలో
కొడుకురా బసవన్న ఉయ్యాలో
పాలు ఇస్తా రారా ఉయ్యాలో
పాపడికి పాలిచ్చి ఉయ్యాలో
సుద్దులే చెప్పింది ఉయ్యాలో
కట్టచుట్టు గడ్డి ఉయ్యాలో
మేయకురా కొడుక ఉయ్యాలో
కట్ట మైసమ్మ ఉయ్యాలో
పట్టేనురా కొడుక ఉయ్యాలో
పుట్టచుట్టు గడ్డి ఉయ్యాలో
మేయకురా కొడుక ఉయ్యాలో
పుట్టలో ఉన్నాది ఉయ్యాలో
బుస్సు నాగన్న ఉయ్యాలో
బుద్ధి కలిగి ఉండు ఉయ్యాలో
పోయి వస్తా కొడుక ఉయ్యాలో

పోయిపోయి పొలిమేర ఉయ్యాలో
వైపుతా చూసింది ఉయ్యాలో
ఆడిన మాట తప్పక ఉయ్యాలో
అడవి తాజొచ్చింది ఉయ్యాలో
బాస చేసినట్టు ఉయ్యాలో
పులిరాజు చేరింది ఉయ్యాలో

ఆవు నీతిని చూసి ఉయ్యాలో
ఆనందమాయె పులి ఉయ్యాలో
అడిగిన వేళన ఉయ్యాలో
తప్పక వచ్చితివి ఉయ్యాలో
ఇది ఏమి చిత్రమో ఉయ్యాలో
ఎన్నడూ కనలేదు ఉయ్యాలో

గంగావు నీతిని ఉయ్యాలో
పులి మెచ్చి పంపెను ఉయ్యాలో
ఆడి తప్పని ఆవు ఉయ్యాలో
తిప్పి పంపిన పులి ఉయ్యాలో
లోకాన ఈ రెండు ఉయ్యాలో
శాశ్వతమ్ముగ నిలిచె ఉయ్యాలో.

# రేపల్లె వాడల్లో వలలో

రేపల్లె వాడల్లో వలలో
కృష్ణుని ఆటల్లో వలలో
ఆటలాడుకొని వలలో
ఇంటికి రాగానే వలలో
తల్లి యశోదమ్మ వలలో
కాళ్లకు నీళ్లిచ్చె వలలో
కాళ్లకు నీళ్లిచ్చె వలలో
కలియపార చూసె వలలో
చేతులకు నీళ్లిచ్చె వలలో
తేరిపార చూసె వలలో
తల్లి యశోదమ్మ వలలో
ఏమని అనుచుండె వలలో
నీ వేలి ఉంగరమూ వలలో
ఏదిరా కష్ణయ్య వలలో

పాలు పిండబోతే వలలో
పాలల్లో పడెనేమో వలలో
పట్టుబట్ట తెచ్చి వలలో
పాలన్ని వడబోసే వలలో
ఇండ్ల లేదుర కష్ణా వలలో
మాయదారి కష్ణా వలలో

పెరుగులమ్మ బోతే వలలో
పెరుగుల పడెనేమో వలలో
పెరుగుదుత్తలు తెచ్చి వలలో
పెరుగంత వడబోసే వలలో
ఇండ్ల లేదుర కష్ణా వలలో
మాయదారి కష్ణా వలలో

చల్ల చెయ్యబోతే వలలో
చల్లల్ల పడెనేమో వలలో
సైనుబట్ట తెచ్చి వలలో
చల్లంతా వడబోసే వలలో
ఇండ్ల లేదుర కష్ణా వలలో
మాయదారి కష్ణా వలలో
వెన్న దీయబోతే వలలో

వెన్నలో పడెనేమో వలలో
వెండి గిన్నెలు తెచ్చి వలలో
వెన్నలో వెతికిరి వలలో
ఇండ్ల లేదుర కష్ణా వలలో
మాయదారి కష్ణా వలలో

బట్టలుతకబోతే వలలో
బాయిల్ల పడెనేమో వలలో
బాయిల నీళ్ళన్ని వలలో
బండ్లల్ల బోయించె వలలో
ఇండ్ల లేదుర కష్ణా వలలో

మాయదారి కష్ణా వలలో

శెల్లలుతకబోతే వలలో
చెరువుల్లో పడెనేమో వలలో
చెరువుల నీళ్లన్ని వలలో
చెట్లకు పోయించె వలలో
ఇండ్ల లేదుర కష్ణా వలలో
మాయదారి కష్ణా వలలో

ఇంతలో గోపికలు వలలో
ఇంటికి చేరారు వలలో
అమ్మ యశోదమ్మ వలలో
మాకు ఇదియేమి బాధ వలలో
మీ వాడు చూడమ్మా వలలో
మహాగడుసు వాడు వలలో
ఎంత దుష్టుడమ్మ వలలో
ఎంత కొంటెవాడు వలలో
మా వాడు కాదమ్మ వలలో
మరి ఎవ్వరో గాని వలలో
మా వాడు మందల్లో వలలో
కలిసి పోయినాడు వలలో
కోమలాంగి భామ వలలో
కొబ్బరి దంచంగ వలలో
కొంగుపట్టి లాగె వలలో

కొంటె కృష్ణుడమ్మా వలలో
మా వాడు కాదమ్మ వలలో
మరి ఎవ్వరో గాని వలలో
మా వాడు మందల్లో వలలో
కలిసి పోయినాడు వలలో
కస్తూరి భామ వలలో
కలువనే పోవంగ వలలో
దారినడ్డగించె వలలో
మీ వాడు ఓయమ్మ వలలో
మా వాడు కాదమ్మ వలలో
మరి ఎవ్వరో గాని వలలో
మా వాడు మందల్లో వలలో
కలిసి పోయినాడు వలలో
పసిడి రంగు భామ వలలో
పిడకలు చేయంగా వలలో
మట్టి పెళ్లతోటి వలలో
కొట్టెనే మీ వాడు వలలో
ఎంత దుష్టుడమ్మ వలలో
ఎంత గడుసు వాడు వలలో
మా వాడు కాదమ్మ వలలో
మరి ఎవ్వరో గాని వలలో
మా వాడు మందల్లో వలలో
కలిసి పోయినాడు వలలో.

# మానేరు మానేరు ఉయ్యాలో

మానేరు మానేరు ఉయ్యాలో
మంచిది కస్తూరి ఉయ్యాలో
మన ఊరి రక్షణకు ఉయ్యాలో
రాజు ఎవ్వరూ ఉయ్యాలో
మన ఊరి రక్షణకు ఉయ్యాలో
రాజు దశరథుడు ఉయ్యాలో
ముత్యాల గద్దెలకు ఉయ్యాలో
దేవీ లెవ్వరు ఉయ్యాలో
ముత్యాల గద్దెలకు ఉయ్యాలో
దేవీ కౌసల్య ఉయ్యాలో
కోటి వెయ్యి గుర్రాల ఉయ్యాలో
కొడుకూ శ్రీరాములు ఉయ్యాలో
కోటి సంతతి దిద్ద ఉయ్యాలో
కోడలూ ఎవ్వరూ ఉయ్యాలో
కోటి సంతతి దిద్ద ఉయ్యాలో
కోడలూ సీతమ్మ ఉయ్యాలో
పగడాల తొట్టెలకు ఉయ్యాలో
బాలుడూ ఎవ్వరూ ఉయ్యాలో
పగడాల తొట్టెలకు ఉయ్యాలో
బాలుడూ లక్ష్మణుడు ఉయ్యాలో
బీరపు జాకిట్ల ఉయ్యాలో
బిడ్డా శాంతమ్మ ఉయ్యాలో
ఆరువేల వందనాలు ఉయ్యాలో
అల్లుడూ ఎవ్వరూ ఉయ్యాలో
ఆరు వేల వందనాలు ఉయ్యాలో
అల్లుడూ దీమంతుడు ఉయ్యాలో
మానేరు మానేరు ఉయ్యాలో
మంచిది కస్తూరి ఉయ్యాలో.

# ఎంటికల దేవునికి ఉయ్యాలో

ఎందరెక్కడిదమ్మ ఉయ్యాలో
ముగ్గురే కొడుకులు ఉయ్యాలో
ముగ్గురి తోడనా ఉయ్యాలో
ఒక్కతే అక్కమ్మ ఉయ్యాలో
అక్కమ్మ నిచ్చిరి ఉయ్యాలో
మా రాజు పట్నంబు ఉయ్యాలో
పెద్దోడ పెరుమాండ్లు ఉయ్యాలో
చెల్లెను తోలుక రార ఉయ్యాలో
నడిపోడు ఉండంగ ఉయ్యాలో
నాకేమి అక్కెర ఉయ్యాలో
నడిపోడ నారాయణ ఉయ్యాలో
చెల్లెను తోలుక రార ఉయ్యాలో
చిన్నోడు ఉండంగ ఉయ్యాలో
నాకేమి అక్కెర ఉయ్యాలో
చిన్నోడ శ్రీకష్ణ ఉయ్యాలో
చెల్లెను తీసుకు రార ఉయ్యాలో
నాయన ఉండంగ ఉయ్యాలో
నేనెంతటోడ్ని ఉయ్యాలో
నాయనా నా తండ్రి ఉయ్యాలో
బిడ్డను తీస్కరా ఉయ్యాలో
నాయిన్న పాయెనే ఉయ్యాలో
మా రాజుపట్నంబు ఉయ్యాలో
కూసుండి కోసేటి ఉయ్యాలో
కూరమల్లు దాటి ఉయ్యాలో
నిలుసుండి కోసేటి ఉయ్యాలో
నిలువు జొన్న దాటి ఉయ్యాలో
వంగంగి కోసేటి ఉయ్యాలో
వరిసేండ్లు దాటి ఉయ్యాలో
నాయనా జేరిండు ఉయ్యాలో
మా రాజు పట్నంబు ఉయ్యాలో
అక్కమ్మ ఎదురొచ్చి ఉయ్యాలో
కాళ్లకు నీళ్లిచ్చి ఉయ్యాలో
కూసుండు నాయనా ఉయ్యాలో
కుర్చీ పీటల మీద ఉయ్యాలో
నిలుసుండు నాయన ఉయ్యాలో
నిలువుటద్దం ముందు ఉయ్యాలో
పండుకో నాయనా ఉయ్యాలో
పట్టుపరుపుల మీద ఉయ్యాలో
పూజల్లు చేసేటి ఉయ్యాలో
ఓ అత్తగారు ఉయ్యాలో
మా నాన్న వచ్చిండు ఉయ్యాలో
మమ్మంపు తార ఉయ్యాలో
వస్తె వచ్చిరి గాని ఉయ్యాలో
ఏమేమి తెచ్చిండు ఉయ్యాలో
పాపనికి పట్టంగి ఉయ్యాలో
పాయిరాల కుల్ల ఉయ్యాలో
శివునికి శీటంగి ఉయ్యాలో
శీపాయి కుల్ల ఉయ్యాలో
నాకు నల్లచీర ఉయ్యాలో
నెమలి కండ్ల రవిక ఉయ్యాలో
అతనికి అమ్రాస ఉయ్యాలో
అంగీల జోడు ఉయ్యాలో
నీకు పట్టుచీర ఉయ్యాలో
అద్దాల రవిక ఉయ్యాలో
నా కెరుక లేదమ్మ ఉయ్యాలో
మీ మామనడుగు ఉయ్యాలో
పట్టె మంచం పైన ఉయ్యాలో
పండుకున్న మామ ఉయ్యాలో
మా నాన్న వచ్చిండు ఉయ్యాలో
మమ్మంపుతార ఉయ్యాలో
వస్తె వచ్చిరి గాని ఉయ్యాలో
ఏమేమి తెచ్చిండు ఉయ్యాలో
పాపనికి పట్టంగి ఉయ్యాలో
పాలు తాగే గిన్నె ఉయ్యాలో
నీలనికి నీలంగి ఉయ్యాలో
నీళ్లు తాగె చెంబు ఉయ్యాలో
అత్తకు పట్టు చీర ఉయ్యాలో
అద్దాల రవిక ఉయ్యాలో
అతనికి అమ్రాస ఉయ్యాలో
అంగీల జోడు ఉయ్యాలో
పట్టంచు ధోతులు ఉయ్యాలో
నీకు తెచ్చే మామ ఉయ్యాలో
నా కెరుక లేదమ్మ ఉయ్యాలో
నీ భర్తనడుగు ఉయ్యాలో
కచ్చీరు నేలేటి ఉయ్యాలో
ఓ భర్త మా రాజ ఉయ్యాలో
మా నాన్న వచ్చిండు ఉయ్యాలో
మమ్మంపుతార ఉయ్యాలో
వస్తె వచ్చిరి గాని ఉయ్యాలో
ఏమి తెచ్చిండు ఉయ్యాలో
పాపనికి పట్టంగి ఉయ్యాలో
పాయిరాల కుల్ల ఉయ్యాలో
శివునికి శీటంగి ఉయ్యాలో
శీపాయి కుల్ల ఉయ్యాలో
అత్తకు పట్టుచీర ఉయ్యాలో
అద్దాల రవిక ఉయ్యాలో
నాకు నల్లచీర ఉయ్యాలో
నెమలి కండ్ల రవిక ఉయ్యాలో
నీకు అమ్రాస ఉయ్యాలో
అంగీల జోడు ఉయ్యాలో
పెట్టెలున్న చీరలు ఉయ్యాలో
కట్టుకోవమ్మ ఉయ్యాలో
పెట్టెలున్న సొమ్ములు ఉయ్యాలో
పెట్టుకోవమ్మ ఉయ్యాలో
పుట్టినింటికి నీవు ఉయ్యాలో
పోయి రావమ్మ ఉయ్యాలో
మెట్టినింటికి నీవు ఉయ్యాలో
శుభముగా మళ్లిరా ఉయ్యాలో.

# కలగంటి మంచాన ఉయ్యాలో

కలగంటి మంచాన ఉయ్యాలో
కలగంటినే సఖియ ఉయ్యాలో
ఏమి కలగంటివే ఉయ్యాలో
యెశోదరాల ఉయ్యాలో
నిత్యంబు కలగంటి ఉయ్యాలో
నిజమేలుకుంటి ఉయ్యాలో
సత్యంబు కలగంటి ఉయ్యాలో
జగమేలుకుంటి ఉయ్యాలో
ఆదినారాయణులు ఉయ్యాలో
నేగన్న కలలు ఉయ్యాలో
పార్వతీ పరమేశ్వరులు ఉయ్యాలో
నేగన్న కలలు ఉయ్యాలో
మూకుట్లో ముద్ద పసుపు
ఉయ్యాలో
నేగన్న కలలు ఉయ్యాలో
పందిట్లో పచ్చి పసుపు ఉయ్యాలో
నేగన్న కలలు ఉయ్యాలో
అరటిపండ్ల తోట ఉయ్యాలో
నేగన్న కలలు ఉయ్యాలో
జామపండ్ల తోట ఉయ్యాలో
నేగన్న కలలు ఉయ్యాలో
నిమ్మపండ్ల తోట ఉయ్యాలో
నేగన్న కలలు ఉయ్యాలో
అరుగుమీద అద్దాలు ఉయ్యాలో
నేగన్న కలలు ఉయ్యాలో
పీటమీద పిల్లండ్లు ఉయ్యాలో
నేగన్న కలలు ఉయ్యాలో
కుచ్చన్ని ముత్యాలు ఉయ్యాలో
నేగన్న కలలు ఉయ్యాలో
కుచ్చన్ని పగడాలు ఉయ్యాలో
నేగన్న కలలు ఉయ్యాలో
కలగంటి మంచాన ఉయ్యాలో
కలగంటినే సఖియ ఉయ్యాలో
ఏమి కలగంటివే ఉయ్యాలో
యెశోదరాల ఉయ్యాలో
నిత్యంబు కలగంటి ఉయ్యాలో
నిజమేలుకుంటి ఉయ్యాలో
సత్యంబు కలగంటి ఉయ్యాలో
జగమేలుకుంటి ఉయ్యాలో
ఆదినారాయణులు ఉయ్యాలో
మా అత్తమామ ఉయ్యాలో
పార్వతీ పరమేశ్వరులు ఉయ్యాలో
మా తల్లీదండ్రి ఉయ్యాలో
మూకుట్లో ముద్ద పసుపు
ఉయ్యాలో
ముత్తైదువా తనము ఉయ్యాలో
పందిట్లొ పచ్చి పసుపు ఉయ్యాలో
బాలింత తనము ఉయ్యాలో
అరటిపండ్ల తోట ఉయ్యాలో
అత్తగారిల్లు ఉయ్యాలో
జామపండ్ల తోట ఉయ్యాలో
తల్లిగారిల్లు ఉయ్యాలో
నిమ్మపండ్ల తోట ఉయ్యాలో
అమ్మమ్మగారిల్లు ఉయ్యాలో
అరుగుమీద అద్దాలు ఉయ్యాలో
అన్నతమ్ముండ్లు ఉయ్యాలో
పీటమీద పిల్లండ్లు ఉయ్యాలో
అక్కాచెల్లెళ్లు ఉయ్యాలో
కుచ్చన్ని ముత్యాలు ఉయ్యాలో
కొడుకులూ కోడండ్లు ఉయ్యాలో
కుచ్చన్ని పగడాలు ఉయ్యాలో
మనుమలూ మనుమరాండ్లు
ఉయ్యాలో
కలగంటి మంచాన ఉయ్యాలో
కలగంటినే సఖియ ఉయ్యాలో.

# సందెలక్ష్మి వచ్చు ఉయ్యాలో

సందెలక్ష్మి వచ్చు ఉయ్యాలో
చంద్రబింబం పలుకు ఉయ్యాలో
ఆమాలు మీదనె ఉయ్యాలో
అమరచిలకలు పలుకు ఉయ్యాలో
అమరచిలకల కింద ఉయ్యాలో
కుంకుమరోలు ఉయ్యాలో
కుంకుమరోలుకు ఉయ్యాలో
కుస్మాయి కుందెనలు ఉయ్యాలో
కుస్మాయి  కుందులకు ఉయ్యాలో
చేకొని రోకళ్లు ఉయ్యాలో
చేకొని రోకళ్లకు ఉయ్యాలో
చేడలిద్దరమ్మ ఉయ్యాలో
ఆడుచూ పాడుచూ ఉయ్యాలో
దంచుచుండేవారు ఉయ్యాలో
పాట చప్పుడుకు ఉయ్యాలో
పాపాయి లేచెను ఉయ్యాలో
పడుకొని పాలిచ్చి ఉయ్యాలో
పక్క పాపెట తీసె ఉయ్యాలో
కూసొని పాలిచ్చి ఉయ్యాలో
కురులు చక్కగ దిద్దె ఉయ్యాలో
ఆడుకోర పాపయ్య ఉయ్యాలో
పక్కవాడ కెళ్లి ఉయ్యాలో
పక్కవాడల ఉండె ఉయ్యాలో
పండ్లామె వచ్చినది ఉయ్యాలో
అమ్మరో ఓయమ్మ ఉయ్యాలో
పండ్లమ్మ వచ్చినయి ఉయ్యాలో
పందిటా ఉన్నయి ఉయ్యాలో
పవుడాల రాసులు ఉయ్యాలో
పట్కపో పాపయ్య ఉయ్యాలో
పట్టి పది దోసిల్లు ఉయ్యాలో
తీసుకో పండ్లమ్మ ఉయ్యాలో
పవుడాలు నేదెస్తి ఉయ్యాలో
పవుడాల మా ఇంట్ల ఉయ్యాలో
పత్తి జొన్నల పోలు ఉయ్యాలో
అమ్మరో ఓయమ్మ ఉయ్యాలో
వలదట పండ్లామె ఉయ్యాలో
ముంగిటా ఉన్నవీ ఉయ్యాలో
ముత్యాల రాసులు ఉయ్యాలో
మంచి మూడు దోసిళ్లు ఉయ్యాలో
తీస్కపో పాపయ్య ఉయ్యాలో
తీసుకో పండ్లమ్మ ఉయ్యాలో
ముత్యాలు నేదెస్తి ఉయ్యాలో
ముత్యాలు మా ఇంట్లో ఉయ్యాలో
మొక్కజొన్నల పోలు ఉయ్యాలో
అమ్మరో ఓయమ్మ ఉయ్యాలో
వలదట పండ్లామె ఉయ్యాలో
మూలకు ఉన్నయి ఉయ్యాలో
మూటగట్టిన వడ్లు ఉయ్యాలో
మంచి మూడు దోసిళ్లు ఉయ్యాలో
తీస్కపో పాపయ్య ఉయ్యాలో
ముడుసుకొని పండ్లామె
ఉయ్యాలో
మూడు కొంగులు చాపె ఉయ్యాలో
నవ్వుతూ పండ్లామే ఉయ్యాలో
నాలుగు కొంగులు చాపె
ఉయ్యాలో
పండ్లామే చీరయె ఉయ్యాలో
పట్టు చీరయ్యింది ఉయ్యాలో
పండ్లామె రవిక ఉయ్యాలో
పట్టు రవికయ్యింది ఉయ్యాలో
పండ్లామె గంప ఉయ్యాలో
బంగారు గంపాయే ఉయ్యాలో
దాని చుట్టబట్టి ఉయ్యాలో
పైడి చుట్టయ్యింది ఉయ్యాలో
ఏ తల్లి గన్నదిర ఉయ్యాలో
నిన్నురో పాపయ్య ఉయ్యాలో
మా తల్లి పార్వతి ఉయ్యాలో
మా తండ్రి శంకరుడు ఉయ్యాలో
సందెలక్ష్మి వచ్చు ఉయ్యాలో
చంద్రబింబం పలుకు ఉయ్యాలో.

# ధర్మపురి వేములవాడ ఉయ్యాలో

ధర్మపురి వేములవాడ ఉయ్యాలో
తపస్సు ఉన్నది ఉయ్యాలో
స్నానానికి రావయ్య ఉయ్యాలో
జడల శంకరుడ ఉయ్యాలో
ఎండియి కొప్పెర్లా ఉయ్యాలో
వేడి నీళ్ల తోడి ఉయ్యాలో
బంగారు కొప్పెర్లా ఉయ్యాలో
చన్నీళ్ళు తోడి ఉయ్యాలో
ఆ నీళ్ళు ఈ నీళ్ళు ఉయ్యాలో
జడల శంకరుడ ఉయ్యాలో
దండాన పట్టుదోతి ఉయ్యాలో
అమరి యున్నది ఉయ్యాలో
కట్టుకొని పోవయ్య ఉయ్యాలో
జడల శంకరుడ ఉయ్యాలో
ధర్మపురి వేములవాడ ఉయ్యాలో
తపస్సు ఉన్నది ఉయ్యాలో
కుంకుమ గాయల్ల ఉయ్యాలో
అమరి యున్నది ఉయ్యాలో
పెట్టుకొని పోవయ్య ఉయ్యాలో
జడల శంకరుడ ఉయ్యాలో
గందాపి గిన్నెల్లా ఉయ్యాలో
అమరి యున్నది ఉయ్యాలో
పంచుకొని పోవయ్య ఉయ్యాలో
జడల శంకరుడ ఉయ్యాలో
పస్పు తప్పుకుల్ల ఉయ్యాలో
అమరి యున్నది ఉయ్యాలో
పెట్టుకొని పోవయ్య ఉయ్యాలో
జడల శంకరుడ ఉయ్యాలో
ధర్మపురి వేములవాడ ఉయ్యాలో
తపస్సు ఉన్నది ఉయ్యాలో
ఆకుల్లా అచ్చంతాలు ఉయ్యాలో
అమరి యున్నది ఉయ్యాలో
పెట్టెల పన్నీరు ఉయ్యాలో
అమరి యున్నది ఉయ్యాలో
చల్లుకొని పోవయ్య ఉయ్యాలో
జడల శంకరుడ ఉయ్యాలో
ధర్మపురి వేములవాడ ఉయ్యాలో
తపస్సు ఉన్నది ఉయ్యాలో
స్నానానికి రావయ్య ఉయ్యాలో
జడల శంకరుడ ఉయ్యాలో.

# హిమవంతునింట్ల పుట్టి ఉయ్యాలో

హిమవంతునింట్ల పుట్టి
ఉయ్యాలో
హిమవంతునింట్ల పెరిగి
ఉయ్యాలో
విదియ పోయి తదియ నాడు
ఉయ్యాలో
కాంతలంతా కూడి ఉయ్యాలో
గన్నేరు కొమ్మ తెచ్చి ఉయ్యాలో
గౌరి పూజలు చేసి ఉయ్యాలో
వత్తి పొత్తులు పెట్టి ఉయ్యాలో
ఒడిబియ్యం పోసి ఉయ్యాలో
ఒప్పైన సద్ది కట్టి ఉయ్యాలో
శంభునికి అప్పగించి ఉయ్యాలో
మాయమ్మ గౌరి దేవి
ఉయ్యాలో
పోయి రావమ్మ ఉయ్యాలో
అత్తవాడల్లకు ఉయ్యాలో
పోయి రావమ్మ ఉయ్యాలో
చీరెలు కొదవనమ్మా ఉయ్యాలో
సారెలు కొదవనమ్మ ఉయ్యాలో
ఆరు నెలలున్నాది ఉయ్యాలో
సంక్రాంతి పండుగా ఉయ్యాలో
పండుగ నాటికి ఉయ్యాలో
నిను తోలుకొస్తమ్మా ఉయ్యాలో
కూర్చుండ పీటేస్త ఉయ్యాలో
కుదుర్ల దొంతులేస్తా ఉయ్యాలో
ఆడేటి దొంతులిస్తా ఉయ్యాలో
అపరంజి మెట్లేస్తా ఉయ్యాలో
మల్లెమొగ్గ చీరెలిస్తా ఉయ్యాలో
అద్దాల రవికలిస్తా ఉయ్యాలో
నీకు దగ్గ సొమ్ములిస్తా
ఉయ్యాలో
గంధం గిన్నెలిస్తా ఉయ్యాలో
నీలాల కమ్మలిస్తా ఉయ్యాలో
నిలువుటద్దమిస్తా ఉయ్యాలో
ఎక్కే అందలాలిస్తా ఉయ్యాలో
పట్టపుటేనుగు లిస్తా ఉయ్యాలో
పది నూర్ల రూకలిస్తా ఉయ్యాలో
పంచకల్యాణి నిస్తా ఉయ్యాలో
మాయమ్మ గౌరమ్మా
ఉయ్యాలో
పోయిరా గౌరమ్మా ఉయ్యాలో
పోయిరా గౌరమ్మా ఉయ్యాలో
మళ్లిరా గౌరమ్మా ఉయ్యాలో

# ఇద్దరక్క చెల్లెండ్లు ఉయ్యాలో

ఇద్దరక్క చెల్లెండ్లు ఉయ్యాలో
ఒకదారి నడువంగ ఉయ్యాలో
అక్కకు దొరికింది ఉయ్యాలో
కుచ్చుల దండ ఉయ్యాలో
అక్క నీకెక్కడిదె ఉయ్యాలో
ఈ కుచ్చులదండ ఉయ్యాలో
కూడెల్లి మల్లన్న ఉయ్యాల్లో
పంపిన దండ ఉయ్యాలో
పర్వతాల మల్లన్న ఉయ్యాలో
పంపిన దండ ఉయ్యాలో
వేములవాడ రాజన్న ఉయ్యాలో
వేసిన దండ ఉయ్యాలో
వేములవాడ రాజన్న ఉయ్యాలో
ఎక్కడుంటాడో ఉయ్యాలో
గుండంలో స్నానమాడి ఉయ్యాలో
గుళ్లె ఉంటాడు ఉయ్యాలో
పేదరాసి పెద్దమ్మ ఉయ్యాలో
చిన్న కోడలిని ఉయ్యాలో
చిన్న కోడలు వయితె ఉయ్యాలో
ఎందుకొచ్చినావు ఉయ్యాలో
సంతానము లేక ఉయ్యాలో
వచ్చినాను స్వామి ఉయ్యాలో
ఇచ్చెటోడు ఈశ్వరుడు ఉయ్యాలో
రాసేది బ్రహ్మ ఉయ్యాలో
శివుని దగ్గరకు పోయి ఉయ్యాలో
చిట్టి రాయించి ఉయ్యాలో
చిట్టిల ఉన్నడే ఉయ్యాలో
నా చిన్ని బాలుడు ఉయ్యాలో
నా చిన్ని బాలునికి ఉయ్యాలో
పాలు లేవాయే ఉయ్యాలో
వసుదేవుడిచ్చిండు ఉయ్యాలో
ఈ వరద కాలువ ఉయ్యాలో
పరమాత్ముడిచ్చిండు ఉయ్యాలో
పాడి ఆవుల మంద ఉయ్యాలో.

# తొమ్మిది రోజులు ఉయ్యాలో

తొమ్మిది రోజులు ఉయ్యాలో
నమ్మిక తోడుతో ఉయ్యాలో
అలరి గుమ్మడి పూలు ఉయ్యాలో
అరుగులు వేయించి ఉయ్యాలో
గోరింట పూలతో ఉయ్యాలో
గోడలు పెట్టించి ఉయ్యాలో
తామర పూలతో ఉయ్యాలో
ద్వారాలు పెట్టించి ఉయ్యాలో
మొగిలి పూలతోను ఉయ్యాలో
మొగురాలు ఎక్కించి ఉయ్యాలో
వాయిలి పూలతో ఉయ్యాలో
వాసాలు చేయించి ఉయ్యాలో
పొన్న పూలతోను ఉయ్యాలో
యిల్లును కప్పించి ఉయ్యాలో
పసుపు ముద్దను చేసి ఉయ్యాలో
తోరణాలు కట్టించి ఉయ్యాలో
దోసపూలతోను ఉయ్యాలో
గౌరమ్మను నిలిపిరి ఉయ్యాలో
చేమంతి పూలతోను ఉయ్యాలో
చెలియను పూజింతురు ఉయ్యాలో
సుందరాంగులెల్ల ఉయ్యాలో
చుట్టూతా తిరిగిరి ఉయ్యాలో
ఆటలు ఆడిరి ఉయ్యాలో
పాటలు పాడిరి ఉయ్యాలో
ఆటపాటలు చూసి ఉయ్యాలో
ఆనందమొందిరి ఉయ్యాలో
గౌరమ్మ వరమిచ్చె ఉయ్యాలో
కాంతలందరికి ఉయ్యాలో
ఆడిన వారికి ఉయ్యాలో
ఆరోగ్యము కల్గు ఉయ్యాలో
పాడిన వారికి ఉయ్యాలో
పాడిపంటలు కల్గు ఉయ్యాలో
విన్నట్టి వారికి ఉయ్యాలో
విష్ణుపథము కల్గు ఉయ్యాలో.

# తల్లికి తండ్రికి ఉయ్యాలో

తల్లికి తండ్రికి ఉయ్యాలో
ఒక్కడే శ్రవనుడు ఉయ్యాలో
భాద్యత గలవాడు ఉయ్యాలో
బుద్దిమంతుడమ్మ ఉయ్యాలో
కనరాని తలితండ్రి ఉయ్యాలో
యాత్రలు కోరింద్రు ఉయ్యాలో
తల్లిదండ్రులిద్దరు ఉయ్యాలో
కావడి లో కూర్చుండ ఉయ్యాలో
బయలెల్లె శ్రవణుడు ఉయ్యాలో
తీర్థయాత్రలకమ్మ  ఉయ్యాలో
దిక్కుదిక్కులు తిరిగి ఉయ్యాలో
అష్టదిక్కులు తిరిగె ఉయ్యాలో
అన్ని దిక్కులు తిరిగి ఉయ్యాలో
అయోధ్యకు చేరె ఉయ్యాలో
అయోధ్యలోపల ఉయ్యాలో
దట్టమైన అడవి ఉయ్యాలో
అడవిలో శ్రవణుడు ఉయ్యాలో
సేద దీరే నచట ఉయ్యాలా
ఆ తల్లి దండ్రులు  ఉయ్యాలో
అలసిన కొడుకును ఉయ్యాలో
పిలిచి దగ్గర తీసి ఉయ్యాలో
నా చిన్ని కుమార ఉయ్యాలో
నా కొడుకా శ్రవణా  ఉయ్యాలో
దప్పికైతున్నాది ఉయ్యాలో
ఉదకాలు తేరా  ఉయ్యాలో
చిలకాల బుర్రకాయ ఉయ్యాలో
చేతబట్టుకోని ఉయ్యాలో
చెట్టు మీద వాలినయి ఉయ్యాలో
కొంగల జంట ఉయ్యాలో
కొంగల లేవగొట్టి ఉయ్యాలో
తరలెను భక్తుడు ఉయ్యాలో
వాలెనమ్మ కొంగలు ఉయ్యాలో
గుండాలమీద ఉయ్యాలో
గుండంల బుర్రకాయ ఉయ్యాలో
బుడబుడ ముంచెను ఉయ్యాలో
మాటు వెట్టినాడు ఉయ్యాలో
రాజు దశరథుడు ఉయ్యాలో
పులియని భ్రమ పడి ఉయ్యాలో
విల్లు ఎక్కు పెట్టె  ఉయ్యాలో
బాణము సంధించి ఉయ్యాలో
భక్తున్ని చంపె ఉయ్యాలో
హరి అని శ్రవణుడు ఉయ్యాలో
నేలకొరిగినాడు ఉయ్యాలో
అయ్యాల్ల ఈ దినము ఉయ్యాలో
అపరాత్రి వేళ ఉయ్యాలో
హరి అన్న వారెవరు ఉయ్యాలో
గుండము లోపల ఉయ్యాలో
ఆత్రంగా రాజొచ్చె ఉయ్యాలో
ఆత్రంగా రాజొచ్చె ఉయ్యాలో
ఆరాజు దశరథుడు ఉయ్యాలో
పడిఉన్న స్రవణున్ని ఉయ్యాలో
చుసి కన్నీరెట్టె ఉయ్యాలో
ఆడితప్పని వాడు ఉయ్యాలో
దశరాథ రాజు ఉయ్యాలో
పలికి బొంకని వాడు ఉయ్యాలో
అయోధ్య రాజు ఉయ్యాలో
జాము గడచిపాలె ఉయ్యాలో
కొడుకు రాకపోయె ఉయ్యాలో

రేయి గడచిపాయె ఉయ్యాలో
రాడాయె నా కొడుకు ఉయ్యాలో
అంతలో అక్కడికి ఉయ్యాలో
వచ్చెను దశరథుడు ఉయ్యాలో
జరిగిన ఘోరాన్ని ఉయ్యాలో
వివరించి నాడమ్మ ఉయ్యాలో
తప్పు నాదని చెప్పి ఉయ్యాలో
తలవంచె దశరథుడు ఉయ్యాలో
కొడుకు లేడని తెలిసి ఉయ్యాలో
విల విల విలపించె ఉయ్యాలో
కళ్లు లేనివారము ఉయ్యాలో
దిక్కెవ్వరు మాకు ఉయ్యాలో
ఎంత పని చేసితివి ఉయ్యాలో
దశరథ రాజ ఉయ్యాలో
నీవును మావలె ఉయ్యాలో
కొడుకు నెడబాసెదవు ఉయ్యాలో
శాపించె వృద్దులు ఉయ్యాలో
ఆగ్రహమ్ము తోడ ఉయ్యాలో
శోకమున మునిగెను ఉయ్యాలో
దశరాథ మారాజు ఉయ్యాలో
ఏ కర్మ ఫలితమో ఉయ్యాలో
జరిగెను ఈ ఘోరముయ్యాలో
బాధతో వెనుతిరిగె ఉయ్యాలో
అయొధ్యకేగె ఉయ్యాలో
ఆ శాప ఫలితమే ఉయ్యాలో
రామునికి వనవాసముయ్యాలో
రామయణ గాథ ఉయ్యాలో
లోకానికెక్కింది ఉయ్యాలో

# అక్కడ ఇక్కడ మెరిసె ఉయ్యాలో

అక్కడ ఇక్కడ మెరిసె ఉయ్యాలో
గుండంల మెరిసె ఉయ్యాలో
గుండంల నీళ్లన్ని ఉయ్యాలో
కుంకుమ లాయె ఉయ్యాలో
కుంకుమలను తోడించి ఉయ్యాలో
కుప్పలు వేసె ఉయ్యాలో
రాలిన కుంకుమ ఉయ్యాలో
రచ్చలె కట్టించె ఉయ్యాలో
మిగిలిన కుంకుమ ఉయ్యాలో
మిద్దెలె కట్టించె ఉయ్యాలో
మిద్దెలో ఉన్నాడు ఉయ్యాలో
ముద్దుల వీరన్న ఉయ్యాలో
ముద్దుల వీరన్నకు ఉయ్యాలో
ఏమేమీ సొమ్ములు ఉయ్యాలో
కందికాయ బొబ్బెర్లు ఉయ్యాలో
కాళ్లకు కడియాలు ఉయ్యాలో
శనిగకాయ బొబ్బెర్లు ఉయ్యాలో
నూటొక్క సొమ్ము ఉయ్యాలో
నుకాయ బొబ్బెర్లు ఉయ్యాలో
నూటొక్క సొమ్ము ఉయ్యాలో
పెసరికాయ బొబ్బెర్లు ఉయ్యాలో
పెయినిండ సొమ్ము ఉయ్యాలో
అన్ని సొమ్ములు పెట్టుకొని ఉయ్యాలో
అద్దంల నీలమ్మ ఉయ్యాలో
అద్దంల నీలమ్మ ఉయ్యాలో
నీ మొగడేడమ్మ ఉయ్యాలో
కాక అస్తం పోయిండు ఉయ్యాలో
కాకైనాడు ఉయ్యాలో
రాయస్తం బోయిండు ఉయ్యాలో
రాయైనాడు ఉయ్యాలో
దేవస్తం బోయిండు ఉయ్యాలో
దేవుడైనాడు ఉయ్యాలో.

# మల్లె తోట్లా ఉన్నా ఉయ్యాలో

**మ**ల్లె తోట్లా ఉన్నా ఉయ్యాలో
ఓ మామ గారు ఉయ్యాలో
ఈ పువ్వు పేరేమి ఉయ్యాలో
సెప్పరాదూ మామ ఉయ్యాలో
ఆ పువ్వు పేరేమో ఉయ్యాలో
నాకు దెలువబోదే ఉయ్యాలో
ఆ పువ్వు పేరేమో ఉయ్యాలో
మీ అత్తా నడుగే ఉయ్యాలో
వంట శాలలున్నా ఉయ్యాలో
ఓయత్తా గారు ఉయ్యాలో
ఈ పువ్వు పేరేమి ఉయ్యాలో
సెప్పరాదూ అత్త ఉయ్యాలో
ఆ పువ్వు పేరేమో ఉయ్యాలో
నాకు దెలువాబోదె ఉయ్యాలో
ఆ పువ్వు పేరేమో ఉయ్యాలో
మీ బావనడుగే ఉయ్యాలో
భారతమ్ము చదివేటి ఉయ్యాలో
బావ పెద్ద బావ ఉయ్యాలో
ఈ పువ్వు పేరేమి ఉయ్యాలో
సెప్పరాదూ బావ ఉయ్యాలో
ఆ పువ్వు పేరేమో ఉయ్యాలో
నాకు దెలువాబోదే ఉయ్యాలో
ఆ పువ్వు పేరేమో ఉయ్యాలో
మీ అక్కానడుగే ఉయ్యాలో
తోట కూరేరేటి ఉయ్యాలో
సాటియారాల ఉయ్యాలో
ఈ పువ్వు పేరేమి ఉయ్యాలో
సెప్పరాదూ అక్కా ఉయ్యాలో
ఆ పువ్వు పేరేమో ఉయ్యాలో
నాకు దెలువాబోదే ఉయ్యాలో
ఆ పువ్వు పేరేమి ఉయ్యాలో
ఆడబిడ్డ నడుగే ఉయ్యాలో
కడపలు గడిగేటి ఉయ్యాలో
కాసాడి బిడ్డా ఉయ్యాలో
ఈ పువ్వు పేరేమి ఉయ్యాలో
సెప్పరాదూ వదిన ఉయ్యాలో
ఆ పువ్వు పేరేమో ఉయ్యాలో
నాకు దెలువబోదే ఉయ్యాలో
ఆ పువ్వు పేరేమో ఉయ్యాలో
మాయన్నా నడుగే ఉయ్యాలో
మల్లె తోట్లా ఉన్నా ఉయ్యాలో
ఓ మరిది గారు ఉయ్యాలో
ఈ పువ్వు పేరేమో ఉయ్యాలో
సెప్పరాదూ మరిది ఉయ్యాలో
ఆ పువ్వు పేరేమో ఉయ్యాలో
నాకు దెలువాబోదూ ఉయ్యాలో
ఆ పువ్వు పేరేమో ఉయ్యాలో
మా అన్నానడుగూ ఉయ్యాలో
మోటల్లు గొట్టేది ఉయ్యాలో
ఓ మొగిలి రాజా ఉయ్యాలో
ఈ పువ్వు పేరేమి ఉయ్యాలో
సెప్పరాదూ రాజా ఉయ్యాలో
గంపల్ల పూలన్నీ ఉయ్యాలో
ఘుమఘుమాలాయే ఉయ్యాలో
గంపకింది సుట్టబుట్టా ఉయ్యాలో మాణి
క్యమాయే ఉయ్యాలో
ఆ పువ్వు పేరేమో ఉయ్యాలో
అది పత్తీ పువ్వు ఉయ్యాలో.

# పొదల పొదల గట్ల నడుమ

పొదల పొదల గట్ల నడుమ నాగమల్లె దారిలో
పొడిసొచ్చె చందమామ నాగమల్లె దారిలో ||2||
(పొదల పొదల గట్ల నడుమ ||3||)
పొదల పొదల గట్ల నడుమ నాగమల్లె దారిలో
పొడిసొచ్చె చందమామ నాగమల్లె దారిలో ||2||
పెద్ద పెద్ద గట్ల నడుమ నాగమల్లె దారిలో
నాకు పెద్ద దండ దొరికె నాగమల్లె దారిలో ||2||
(పెద్ద పెద్ద గట్ల నడుమ ||3||)
నీకు మామ నాకు మామ నాగమల్లె దారిలో
లోకానికి చందమామ నాగమల్లె దారిలో ||2||
(నీకు మామ నాకు మామ ||3||)
చిన్న చిన్న గట్ల నడుమ నాగమల్లె దారిలో
నాకు చిన్న దండ దొరికె నాగమల్లె దారిలో ||2||
(చిన్న చిన్న గట్ల నడుమ ||3||)
నీకు మామ నాకు మామ నాగమల్లె దారిలో
లోకానికి చందమామ నాగమల్లె దారిలో ||2||
(నీకు మామ నాకు మామ ||3||)
పచ్చ పచ్చ గట్ల నడుమ నాగమల్లె దారిలో
పచ్చపూల దండ దొరికె నాగమల్లె దారిలో ||2||
(పచ్చ పచ్చ గట్ల నడుమ ||3||)
నీకు మామ నాకు మామ నాగమల్లె దారిలో
లోకానికి చందమామ నాగమల్లె దారిలో ||2||
(నీకు మామ నాకు మామ ||3||)
ఎర్ర ఎర్ర గట్ల నడుమ నాగమల్లె దారిలో
ఎర్ర పూల దండ దొరికె నాగమల్లె దారిలో ||2||
(ఎర్ర ఎర్ర గట్ల నడుమ ||3||)
నీకు మామ నాకు మామ నాగమల్లె దారిలో
లోకానికి చందమామ నాగమల్లె దారిలో ||2||
(నీకు మామ నాకు మామ ||3||)
కొండగట్టు గట్ల నడుమ నాగమల్లె దారిలో
కోటొక్క పూలదండ నాగమల్లె దారిలో ||2||
(కొండగట్టు గట్ల నడుమ ||3||)
కొండగట్టు అంజన్న నాగమల్లె దారిలో
కొలిసి నీకు దండలోయి నాగమల్లె దారిలో ||2||
(కొండగట్టు అంజన్న ||3||)
పొదల పొదల గట్ల నడుమ నాగమల్లె దారిలో
పొడిసొచ్చె చందమామ నాగమల్లె దారిలో ||2||
(పొదల పొదల గట్ల నడుమ ||3||)
పొదల పొదల గట్ల నడుమ నాగమల్లె దారిలో.

# పల్లెల్లో బతుకమ్మ నాగమల్లెలో

పల్లెల్లో బతుకమ్మ నాగమల్లెలో
పువ్వయ్యి పూసింది తీగమల్లెలో ||2||
పల్లెల్లో బతుకమ్మ నాగమల్లెలో
పువ్వయ్యి పూసింది తీగమల్లెలో ||3|| 'పల్లెల్లో'
పట్నంల బతుకమ్మ నాగమల్లెలో
పండూగ చేసింది తీగమల్లెలో ||2||
పట్నంల బతుకమ్మ నాగమల్లెలో
పండూగ చేసింది తీగమల్లెలో ||3|| 'పట్నంల'
బాదల్ల బతుకమ్మ నాగమల్లెలో
బందువై నిలిచింది తీగమల్లెలో ||2||
బాదల్ల బతుకమ్మ నాగమల్లెలో
బందువై నిలిచింది తీగమల్లెలో ||3|| 'బాదల్ల'
కష్టాల్లో బతుకమ్మ నాగమల్లెలో
కన్నీరు తుడిచింది తీగమల్లెలో ||2||
కష్టాల్లో బతుకమ్మ నాగమల్లెలో
కన్నీరు తుడిచింది తీగమల్లెలో ||3|| 'కష్టాల్లో'
తంగేడు పువ్వుల్లో నాగమల్లెలో
తల్లి నిను కొలుద్దుము తీగమల్లెలో ||2||
తంగేడు పువ్వుల్లో నాగమల్లెలో
తల్లి నిను కొలుద్దుము తీగమల్లెలో ||3|| 'తంగేడు'

# తంగేడు పువ్వుల్ల చందమామ

తంగేడు పువ్వుల్ల చందమామ
మళ్లీ ఎప్పుడొస్తావు చందమామ
గునుగై పువ్వుల్ల చందమామ
బతుకమ్మ పోతుంది చందమామ
పోతే పోతివి గానీ చందమామ
మళ్లీ ఎప్పుడొస్తావు చందమామ
ఏడాది కోసారి చందమామ
ఆడుకుంటూ వస్తా చందమామ
బీరాయి పువ్వుల్లా చందమామ
మళ్లీ ఎప్పుడొస్తావు చందమామ
ముత్యాల పువ్వుల్లా చందమామ
బతుకమ్మ పోతుంది చందమామ
పోతే పోతివి గానీ చందమామ
మళ్లీ ఎప్పుడొస్తావు చందమామ
ఏడాది కోసారి చందమామ
ఆడుకుంటూ వస్తా చందమామ
తోక బంతి పువ్వుల్లా చందమామ
మళ్లీ ఎప్పుడొస్తావు చందమామ
కట్లాయి పువ్వుల్లా చందమామ
బతుకమ్మ పోతుంది చందమామ
పోతే పోతివి గానీ చందమామ
మళ్లీ ఎప్పుడొస్తావు చందమామ
ఏడాది కోసారి చందమామ
ఆడుకుంటూ వస్తా చందమామ
రుద్రాక్ష పువ్వుల్లా చందమామ
మళ్లీ ఎప్పుడొస్తావు చందమామ
గోరంట పువ్వుల్లా చందమామ
బతుకమ్మ పోతుంది చందమామ.

# కొండ కొండల నడుమ ఉయ్యాలో

**కొం**డ కొండల నడుమ ఉయ్యాలో
కొండల్లా నడుమ ఉయ్యాలో
సీతమ్మ కన్నదీ ఉయ్యాలో
ఇద్దరే కవలలు ఉయ్యాలో
ఏడవకురా లవ్వయ్య ఉయ్యాలో
ఏడవకురా కుశల ఉయ్యాలో
ఏడిస్తే నిన్నెవరు ఉయ్యాలో
ఎత్తుకునే వారు ఉయ్యాలో
పుట్టకూసము తెచ్చు ఉయ్యాలో
పులిగోర్లు తెచ్చు ఉయ్యాలో
నానమ్మ కౌసల్య  ఉయ్యాలో
వచ్చె వూర్కుండు ఉయ్యాలో
ఏడవకురా లవ్వయ్య ఉయ్యాలో
ఏడవకురా కుశల ఉయ్యాలో
ఏడిస్తే నిన్నెవరు ఉయ్యాలో
ఎత్తుకునే వారు ఉయ్యాలో
మెడ గొలుసులూ తెచ్చు ఉయ్యాలో
ఉంగరం దెచ్చు ఉయ్యాలో
మేనత్త శాంతమ్మ ఉయ్యాలో
వచ్చె వూర్కుండు ఉయ్యాలో
ఏడవకురా లవ్వయ్య ఉయ్యాలో
ఏడవకురా కుశల ఉయ్యాలో
ఏడిస్తే నిన్నెవరు ఉయ్యాలో
ఎత్తుకునే వారు ఉయ్యాలో
ఉగ్గు గిన్నెలు దెచ్చు ఉయ్యాలో
ఉయ్యాలలూ దెచ్చు ఉయ్యాలో
పినతల్లి ఊర్మిళా ఉయ్యాలో
వచ్చేను వూర్కుండు ఉయ్యాలో
ఏడవకురా లవ్వయ్య ఉయ్యాలో
ఏడవకురా కుశల ఉయ్యాలో
ఏడిస్తే నిన్నెవరు ఉయ్యాలో
ఎత్తుకునే వారు ఉయ్యాలో
విద్యాబుద్ధులు నేర్పు ఉయ్యాలో
విల్లంబులూ దెచ్చు ఉయ్యాలో
పినతండ్రి లక్ష్మణుడు ఉయ్యాలో
వచ్చేను వూర్కుండు ఉయ్యాలో
ఏడవకురా లవ్వయ్య ఉయ్యాలో
ఏడవకురా కుశల ఉయ్యాలో
ఏడిస్తే నిన్నెవరు ఉయ్యాలో–
ఎత్తుకునే వారు ఉయ్యాలో
ఎల్లగుర్రముదెచ్చు ఉయ్యాలో
ఏలే రాజ్యమిచ్చు ఉయ్యాలో
మీ తండ్రి రఘురాము ఉయ్యాలో
వచ్చేను వూర్కుండు ఉయ్యాలో.

# కట్టమీద రెండు ఉయ్యాలో

కట్టమీద రెండు ఉయ్యాలో
కరి వేపచెట్లు ఉయ్యాలో
గాలి వానకవి ఉయ్యాలో
కొమ్మలల్లాడె ఉయ్యాలో
చెట్లకు మా తల్లి ఉయ్యాలో
చెయ్యెత్తి మొక్కె ఉయ్యాలో
నందులకు నీళ్ళు పోసి
ఉయ్యాలో
నరుకు మొక్కె ఉయ్యాలో
కొమ్మలకు మా తల్లి ఉయ్యాలో
కొంగు ఒడ్డినాది ఉయ్యాలో
కొంగులో పడ్డవి ఉయ్యాలో
కోటొక్క మొగ్గ ఉయ్యాలో
మొక్కిన చేతులు ఉయ్యాలో
మొగిలి రేకులు ఉయ్యాలో
వంగిన నడుములు ఉయ్యాలో
టుంగుటుయ్యాల ఉయ్యాలో
రామలక్ష్మణుల పెండ్లి
ఉయ్యాలో
లగ్గమెల్లుండి ఉయ్యాలో
దంచరే జనులార ఉయ్యాలో
సన్నసారి వడ్లు ఉయ్యాలో
దంచిన దంగవి ఉయ్యాలో
సన్నసారి వడ్లు ఉయ్యాలో
వంచిన వంగరె ఉయ్యాలో
అమ్మ నీ కోడండ్లు ఉయ్యాలో
అమ్మ నీ కోడండ్లకు ఉయ్యాలో
ఏమని చెప్పితివె ఉయ్యాలో
ముగ్గురున్న చోట ఉయ్యాలో
ముచ్చట్లాడకుమన్న ఉయ్యాలో
నలుగురున్న చోట ఉయ్యాలో
నగుబాటు కాకుమన్న
ఉయ్యాలో.

# నాగేటి సాల్లల్ల ఉయ్యాలో

నాగేటి సాల్లల్ల ఉయ్యాలో
సీతమ్మ పుట్టింది ఉయ్యాలో
జనక మారాజింట ఉయ్యాలో
పెరిగింది సీతమ్మ ఉయ్యాలో
పెరిగినా సీతమ్మ ఉయ్యాలో
పెళ్ళీళ్ళు గోరింది ఉయ్యాలో
ఏడిండ్ల సందునా ఉయ్యాలో
ఎలబ్రద్రి చెట్టు ఉయ్యాలో
ఆ ఎలబ్రద్రి చెట్టుకూ ఉయ్యాలో
ఏడే మొగ్గలూ ఉయ్యాలో
ఏడు మొగ్గలూ ఉయ్యాలో
ఏడు మొగ్గల పత్తి ఉయ్యాలో
తక్కెడూ అయ్యింది ఉయ్యాలో
ఆ తక్కెడూ పత్తికీ ఉయ్యాలో
వొక్కటే ఏకు ఉయ్యాలో
ముసలోళ్ళు వడికిరీ ఉయ్యాలో
ముత్యాల పోగు ఉయ్యాలో
పడుసోళ్ళు వడికిరీ ఉయ్యాలో
పగడాల పోగు ఉయ్యాలో
ఆ పోగు ఈ పోగు ఉయ్యాలో
కలె పడుగు జుట్టిదీ ఉయ్యాలో
చింతకింది సాలయ్య ఉయ్యాలో
చీరె నెయ్యవయ్య ఉయ్యాలో
నేసెనే శాలయ్య ఉయ్యాలో
నెలకొక్క గజము ఉయ్యాలో
అంచుకూ ఏసిండు ఉయ్యాలో
అర్ధనాల పోగు ఉయ్యాలో
కొంగుకూ ఏసిండు ఉయ్యాలో
బంగారు పోగు ఉయ్యాలో
ఆ సీర నైతేనే ఉయ్యాలో
సీతమ్మ మెచ్చెనే ఉయ్యాలో.

# ఉత్తముని పేరేమి ఉయ్యాలో

ఉత్తముని పేరేమి ఉయ్యాలో
ఊరు పేరేమి ఉయ్యాలో
సత్యపురుషుల గన్న ఉయ్యాలో
సాధువు పేరేమి ఉయ్యాలో
ఉత్తముడు దశరథుడు ఉయ్యాలో
ఊరు అయోధ్య ఉయ్యాలో
ఇల్లాళ్ళు ముగ్గురు ఉయ్యాలో
ఈ దశరథునకు ఉయ్యాలో
పిల్లలు నల్గురు ఉయ్యాలో
పేరు గలవారు ఉయ్యాలో
సత్య పురుషునిగన్న ఉయ్యాలో
సాధ్వీ కౌసల్య ఉయ్యాలో
శ్రీరామ జయరామ ఉయ్యాలో
శృంగారరామ ఉయ్యాలో
జగతిపై రామయ్య ఉయ్యాలో
జన్మించినాడు ఉయ్యాలో
సత్యమ్ము లోకాన ఉయ్యాలో
స్థాపించినాడు ఉయ్యాలో
తల్లిదండ్రుల మాట ఉయ్యాలో
చెల్లించినాడు ఉయ్యాలో
సీతా మహాదేవి ఉయ్యాలో.
సృష్టి లోపలను ఉయ్యాలో
మా తల్లి వెలసింది ఉయ్యాలో
మహనీయురాలు ఉయ్యాలో
అయోధ్య రామయ్య ఉయ్యాలో
అన్నయ్య మాకు ఉయ్యాలో
వాలుగన్నుల సీత ఉయ్యాలో
వదినెమ్మ మాకు ఉయ్యాలో
వారిద్దరూ కూడి ఉయ్యాలో
వనము కేగినారు ఉయ్యాలో
సీతమ్మ రామయ్య ఉయ్యాలో
దారి కదిలితే ఉయ్యాలో
పారిజాత పూలు ఉయ్యాలో
పలవరించినవి ఉయ్యాలో
సీత పుట్టగ నేల ఉయ్యాలో
లంకచెడ నేల ఉయ్యాలో
లంకకు విభీషణుడు ఉయ్యాలో
రాజుగా నేల ఉయ్యాలో
ఏడు ఏడు ఏండ్లు ఉయ్యాలో
పదునాలుగేండ్లు ఉయ్యాలో
ఎట్లుంటివి సీత ఉయ్యాలో
నట్టడవిలోన ఉయ్యాలో
లక్ష్మయ్య నీ మరిది ఉయ్యాలో
రక్షిస్తు వుండగా ఉయ్యాలో
దండాలు దండాలు ఉయ్యాలో
దశరథరామ ఉయ్యాలో
దయలేద మముచూడ ఉయ్యాలో
దాక్షిణ్యధామ ఉయ్యాలో.

# సీతమ్మ వాకిట ఉయ్యాలో

సీతమ్మ వాకిట ఉయ్యాలో
పరిసి ముగ్గులేసె ఉయ్యాలో
పటుమాని రాములు ఉయ్యాలో
పైడి దువ్వెన పంపె ఉయ్యాలో
వద్దని సీతమ్మ ఉయ్యాలో
తిప్పి పంపినది ఉయ్యాలో
ఒప్పుకొని రాములు ఉయ్యాలో
వడ్డాణము పంపె ఉయ్యాలో
వద్దని సీతమ్మ ఉయ్యాలో
తానలిగి పండె ఉయ్యాలో
ముప్పది మూల్లాది ఉయ్యాలో
ముసుగు పచ్చరము ఉయ్యాలో
ముద్దురాలు సీతమ్మ ఉయ్యాలో
ముసుకొప్పు పట్టె ఉయ్యాలో
పనురాలు సీతమ్మ ఉయ్యాలో
పండుకొన్నది ఉయ్యాలో
అత్త కౌసల్య ఉయ్యాలో
లేపిన లేవది ఉయ్యాలో
ఆడబిడ్డ శాంత ఉయ్యాలో
లేపిన లేవది ఉయ్యాలో
భర్త శ్రీరాములు ఉయ్యాలో
లేపిన లేవది ఉయ్యాలో
పొద్దున మన ఊరిలో ఉయ్యాలో
పొట్లెపూల అంగడి ఉయ్యాలో
పొట్లెపూల చీర ఉయ్యాలో
కొని తెస్త లేవమ్మ ఉయ్యాలో
మధ్యాహ్నము మన ఊరిలో
ఉయ్యాలో
మల్లెపూల అంగడి ఉయ్యాలో
మల్లెపూలు చాలా ఉయ్యాలో
కొని తెస్తా లేవమ్మ ఉయ్యాలో
సాయంత్రం మన ఊరిలో
ఉయ్యాలో
సన్నజాజుల అంగడి ఉయ్యాలో
సన్నజాజి పూలు ఉయ్యాలో
తెస్త లేవమ్మ ఉయ్యాలో
ముసిముసి నవ్వుకుంటు
ఉయ్యాలో
ముసుగైన తీసె ఉయ్యాలో
పకపక నవ్వుకుంటు ఉయ్యాలో
పరుపైన చుట్టె ఉయ్యాలో
సతియు, పతియు ఉయ్యాలో
సంతోషముండిరి ఉయ్యాలో
ఆలుమగలిద్దరు ఉయ్యాలో
ఆనందముగుండిరి ఉయ్యాలో.

# చిన్న చేతికి రెండు ఉయ్యాలో

చిన్న చేతికి రెండు ఉయ్యాలో
సన్నపు గాజులు ఉయ్యాలో
అవ్వి నా చేతికి ఉయ్యాలో
చుక్కలయ్యి మెరిసె ఉయ్యాలో
పరమాత్ముడిచ్చిండు ఉయ్యాలో
పసుపు కుంకుమ ఉయ్యాలో
అవి నా నుదుటికి ఉయ్యాలో
పద్మములయి మెరిసె ఉయ్యాలో
సూర్యుడు ఇచ్చిండు ఉయ్యాలో
చుక్కల మట్టెలు ఉయ్యాలో
అవ్వి నా కాళ్లకు ఉయ్యాలో
చుక్కలయ్యి మెరిసె ఉయ్యాలో
చంద్రుడు ఇచ్చిండు ఉయ్యాలో
చందనపు రింగులు ఉయ్యాలో
అవ్వి నా చెవులకు ఉయ్యాలో
కమ్మలయ్యి మెరిసె ఉయ్యాలో
భగవంతుడిచ్చిండు ఉయ్యాలో
బంతిపూ బారులు ఉయ్యాలో
అవ్వి నా కొప్పునా ఉయ్యాలో
బంగారు పూతలే ఉయ్యాలో
పరమేశుడిచ్చిండు ఉయ్యాలో
పాలల్ల పగడాలు ఉయ్యాలో
అవ్వి నా మెడలోన ఉయ్యాలో
ముత్యాల హారాలు ఉయ్యాలో
రాజేంద్రుడిచ్చిండు ఉయ్యాలో
దోసిళ్ల రత్నాలు ఉయ్యాలో
అవ్వి నా కొప్పులో ఉయ్యాలో
చెక్కుడూ బిళ్లలే ఉయ్యాలో
బ్రహ్మదేవుడిచ్చె ఉయ్యాలో
బంగారు రేకులు ఉయ్యాలో
అవ్వి నా నడుముకు ఉయ్యాలో
రింగుల వడ్డానముయ్యాలో
విష్ణుమూర్తి ఇచ్చె ఉయ్యాలో
ఇంపైన వంకులు ఉయ్యాలో
అవి నా దండెలకు ఉయ్యాలో
ధగధగా మెరిసెను ఉయ్యాలో
కృష్ణుడూ ఇచ్చిండు ఉయ్యాలో
గజ్జెల పట్టీలు ఉయ్యాలో
అవ్వి నా నట్టింట ఉయ్యాలో
ఘల్లుఘల్లున మోగె ఉయ్యాలో
వెంకటేశుడిచ్చె ఉయ్యాలో
వేయొక్క పగడంబు ఉయ్యాలో
అవ్వి నా పాపట్ల ఉయ్యాలో
పారిజాతంబులె ఉయ్యాలో
రామయ్య ఇచ్చిండు ఉయ్యాలో
బంగారు పింఛాలు ఉయ్యాలో
మల్లె పూల పొదలు ఉయ్యాలో
సన్నజాజులు అల్లి ఉయ్యాలో
పార్వతి పూజకు ఉయ్యాలో
బయలెల్లె పడతులు ఉయ్యాలో
కాత్యాయని పూజకు ఉయ్యాలో
కాంతలంతా కదిలె ఉయ్యాలో
కాత్యాయని పూజకు ఉయ్యాలో
కాంతలంతా కదిలె ఉయ్యాలో.

# ఏనుగులా కట్లెపువ్వు గౌరమ్మ

ఏనుగులా కట్లెపువ్వు గౌరమ్మ
ఏమాని వర్ణింతునే గౌరమ్మ
తీరైన పువ్వప్పునే గౌరమ్మ
తీగలా ఒడ్డాణమే గౌరమ్మ
ఘనమైన గున్కపువ్వే గౌరమ్మ
గంటలా ఒడ్డాణమే గౌరమ్మ
ఒక్కేసి ఎల్కపండే గౌరమ్మ
దూరాన దోరవండే గౌరమ్మ
ఆ పండు దెప్పిత్తునే గౌరమ్మ
ఆక్షంత లేపిస్తునే గౌరమ్మ
పసుపుతో పూజిత్తునే గౌరమ్మ
కుంకుమల గుప్పిత్తునే గౌరమ్మ
పట్టు సీరెలు దెత్తునే గౌరమ్మ
పట్టు రైకెలు దెత్తునే గౌరమ్మ
ఎండి కోలలు దెత్తునే గౌరమ్మ
పైడి కోలలు దెత్తునే గౌరమ్మ
ఆ కోల లీ కోలలే గౌరమ్మ
దేవదారీ కోలలే గౌరమ్మ.

# వెండి కొండలపైన ఉయ్యాలో

వెండి కొండలపైన ఉయ్యాలో వెలసిన తల్లికి ఉయ్యాలో
పార్వతీదేవికి ఉయ్యాలో పాపాయి పుట్టింది ఉయ్యాలో
పుట్టింది ఎవ్వరూ ఉయ్యాలో పోశమ్మ తల్లి ఉయ్యాలో
లోకాలనేలేటి ఉయ్యాలో చల్లటి తల్లమ్మ ఉయ్యాలో
గండదీపంబులు ఉయ్యాలో నిండుగా బోనాలు ఉయ్యాలో
కాపాడి రక్షించు ఉయ్యాలో మా తల్లి పోచమ్మ ఉయ్యాలో
తప్పులను మన్నించు ఉయ్యాలో మా తల్లి పోచమ్మ ఉయ్యాలో
శివలోక పట్నాన ఉయ్యాలో తండ్రి శివుడమ్మ ఉయ్యాలో
పార్వతిదేవికి ఉయ్యాలో సంతానమేడుగురు ఉయ్యాలో
ఏడుగురి ఎనకన ఉయ్యాలో ఏ చోద్యమే లేదు ఉయ్యాలో
రావిచెట్టుకు రెండు ఉయ్యాలో దీపాలు ముట్టించి ఉయ్యాలో
రాజ్యాలు యేలేటి ఉయ్యాలో తండ్రి శివుడమ్మ ఉయ్యాలో
మర్రిచెట్టుకు రెండు ఉయ్యాలో దీపాలు ముట్టించి ఉయ్యాలో
మా లోకమేలేటి ఉయ్యాలో తండ్రి శివుడమ్మ ఉయ్యాలో
ఏడుగురు బిడ్డలు ఉయ్యాలో సంతానముండదు ఉయ్యాలో
ఏడుగురి ఎనకన ఉయ్యాలో ఏ చోద్యమే లేదు ఉయ్యాలో
వాగులు దాటంగ ఉయ్యాలో వాకరింతలాయె ఉయ్యాలో
కాల్వలు దాటంగ ఉయ్యాలో కడుపుల ఏర్పడే ఉయ్యాలో
మూడేసి నెలలు ఉయ్యాలో ముద్దలేర్పడే ఉయ్యాలో
నాలుగేసి నెలలు ఉయ్యాలో నవ్వే చందమామ ఉయ్యాలో
ఐదేసి నెలలు ఉయ్యాలో అయుష్షునే పోసె ఉయ్యాలో
ఆరేసి నెలలు ఉయ్యాలో అవతరించె రూపు ఉయ్యాలో
ఏడేసి నెలలు ఉయ్యాలో వెలగ పండునడిగె ఉయ్యాలో
ఎనిమిదో నెలలు ఉయ్యాలో కలెదిరిగె కడుపుల ఉయ్యాలో
తొమ్మిదేసి నెలలు ఉయ్యాలో దోసపండ్లనడిగె ఉయ్యాలో
అన్నించి పార్వతి ఉయ్యాలో ఏమడిగినాది ఉయ్యాలో
ముప్పయి కూరలు ఉయ్యాలో ముల్క సారులన్ని ఉయ్యాలో
అరవయి కూరలు ఉయ్యాలో అల్లము పచ్చళ్లు ఉయ్యాలో
డెబ్బయి కూరలు ఉయ్యాలో దండి పాలు పెరుగు ఉయ్యాలో
నడుమ అన్నమందు ఉయ్యాలో నల్లావుల నెయ్యి ఉయ్యాలో
చక్కని పార్వతి ఉయ్యాలో బోనం చేసినాది ఉయ్యాలో
ఆకులు పోకలు ఉయ్యాలో ఇడియము చేసిరి ఉయ్యాలో
తండ్రి శివుడమ్మ ఉయ్యాలో తల్లి పార్వతిదేవి ఉయ్యాలో
నందిమీద శివుడు ఉయ్యాలో సాలుబడ్డాడమ్మ ఉయ్యాలో
పట్టిరి నందిని ఉయ్యాలో పగ్గాల తోటి ఉయ్యాలో

కట్టిరి నందిని ఉయ్యాలో ద్వజస్తంభానికి ఉయ్యాలో
వచ్చేటి నందికి ఉయ్యాలో ఏమి వందనాలు ఉయ్యాలో
ఎర్రని డెక్కలకు ఉయ్యాలో వెయ్యి వందనాలు ఉయ్యాలో
నల్లని డెక్కలకు ఉయ్యాలో నాడె వందనాలు ఉయ్యాలో
పచ్చని డెక్కలకు ఉయ్యాలో పగిడి వందనాలు ఉయ్యాలో
కడుపుల నొచ్చెనే ఉయ్యాలో తన వార్ని పిలిచెనే ఉయ్యాలో
దయ్యాలు భూతాలు ఉయ్యాలో కడుపుల పోచమ్మ ఉయ్యాలో
కలకోటి బిడ్డలను ఉయ్యాలో కడుపుల పోచమ్మ ఉయ్యాలో
అమ్మరో పార్వతి ఉయ్యాలో అదిరి పడకమ్మ ఉయ్యాలో
అదిరి పడకమ్మ ఉయ్యాలో ఊరికే పుట్టను ఉయ్యాలో
ముత్తుమూ భండారు ఉయ్యాలో ముంగలొడి గావాలె ఉయ్యాలో
నందుమూ భండారు ఉయ్యాలో నడుమొడి గావాలె ఉయ్యాలో
పందుమూ భండారు పక్కవొడి కావాలి ఉయ్యాలో
ఏడేడు పట్నాల ఉయ్యాలో ఎల్లలే రాయాలే ఉయ్యాలో
సెందమ్మ పట్నాలు ఉయ్యాలో నెదురనే రాయాలి ఉయ్యాలో
పచ్చపిండి పట్నాలుయ్యాలో పాటిగా రాయాలి ఉయ్యాలో
తెల్లపిండి పట్నాలుయ్యాలో తెలివిగా రాయాలి ఉయ్యాలో
వారంచు చీరలు ఉయ్యాలో అవి నాకు కావాలి ఉయ్యాలో
అద్దాల రవికలు ఉయ్యాలో అవి నాకు కావాలి ఉయ్యాలో
కొబ్బరి కాయలు ఉయ్యాలో కోటిగా కావాలి ఉయ్యాలో
నిమ్మయి కాయలు ఉయ్యాలో నిలువునా కోయాలె ఉయ్యాలో
బాయిల్ల రాముడు ఉయ్యాలో బాగుగా రావాలె ఉయ్యాలో
ఎండివి జమిడికెలు ఉయ్యాలో వేపాకు రెమ్మలు ఉయ్యాలో
గొప్పగా శరణాలు ఉయ్యాలో ఘనముగా కావాలె ఉయ్యాలో
పుడితివే పోచమ్మ ఉయ్యాలో దుడ్డుక్కట్టాలమ్మ ఉయ్యాలో
పట్టనే పట్టింది ఉయ్యాలో చెట్ల సంచారము ఉయ్యాలో
యెల్లినా గౌరమ్మ ఉయ్యాలో ఏగిరంగా పాయె ఉయ్యాలో
గోరంత పొదలల్ల ఉయ్యాలో కూసున్నదోయమ్మ ఉయ్యాలో
అడువుల్లనే ఉండి ఉయ్యాలో శివుని పొట్టమీద ఉయ్యాలో
బొబ్బలు పుట్టించె ఉయ్యాలో అమ్మవారయ్యింది ఉయ్యాలో
పుట్ల బాధలొస్తె ఉయ్యాలో పోచమ్మను మెప్పించె ఉయ్యాలో
కల్లు సాక పోసి ఉయ్యాలో కోళ్లను ఎదిరిచ్చి ఉయ్యాలో
వేగన్న బోనాలు ఉయ్యాలో ఎదురుఘటము కుండలుయ్యాలో
తెల్ల రేఖ చీరలుయ్యాలో అంచుయే రవికలు ఉయ్యాలో
ధూపమ్ము నీకేసి ఉయ్యాలో దీపాలు నిలిపిరి ఉయ్యాలో
వందనం వందనం ఉయ్యాలో మా తల్లి పోచమ్మ ఉయ్యాలో
జగమేలు తల్లికి ఉయ్యాలో వందనాలు తల్లి ఉయ్యాలో
వందనం వందనం ఉయ్యాలో మాతల్లి పోచమ్మ ఉయ్యాలో.

# భూమ్మీద చారెడు ఉయ్యాలో

భూమ్మీద చారెడు ఉయ్యాలో
భండారు పోసి ఉయ్యాలో
భూదేవి నా పాట ఉయ్యాలో
బుగ్గలై రానియ్యి ఉయ్యాలో
జగతిపై దోసెడు ఉయ్యాలో
చంద్రంబు పోసి ఉయ్యాలో
జలదేవి నా పాట ఉయ్యాలో
జనులంత మెచ్చగా ఉయ్యాలో
రాయగిరి పట్నాన ఉయ్యాలో
పేరైన వాడలో ఉయ్యాలో
దయగల్ల బలరాజు ఉయ్యాలో
సత్యవతి రాణియు ఉయ్యాలో
ఆ రాజుకు కల్గె ఉయ్యాలో
నలుగురు సంతానము
ఉయ్యాలో
నలుగురు నవనీత ఉయ్యాలో
బంగారు బొమ్మలే ఉయ్యాలో
కొడుకులు లేరన్న ఉయ్యాలో
చింత లేదమ్మ ఉయ్యాలో
ఇల్లంత సందడి ఉయ్యాలో
ఆ పైడి బొమ్మలతో ఉయ్యాలో
ఆ బిడ్డలాడేటి ఉయ్యాలో
బొడ్డెమ్మ పండుగే ఉయ్యాలో
రానే వచ్చింది ఉయ్యాలో
పెత్తనమాస ఉయ్యాలో
బంతులు తిరిగేటి ఉయ్యాలో
బతుకమ్మ పండుగా ఉయ్యాలో
రానే వచ్చింది ఉయ్యాలో
సద్దులపండుగ ఉయ్యాలో
పువ్వు తెచ్చేవారు ఉయ్యాలో
లేరైరి ఇంట్లోన ఉయ్యాలో
వేకువ జామున ఉయ్యాలో
నలుగురు బిడ్డలు ఉయ్యాలో
అడవికి పోయిరి ఉయ్యాలో
బతుకమ్మ పూలకు ఉయ్యాలో
ఆత్రాన పూసిన ఉయ్యాలో
తంగేడు పువ్వులు ఉయ్యాలో
ముందుగా పూసిన ఉయ్యాలో
ముద్దబంతి పూలు ఉయ్యాలో
మాపటికి పూసిన ఉయ్యాలో
చామంచ పూలు ఉయ్యాలో
గుండ్రంగా పూసిన ఉయ్యాలో
సండ్రాయి పువ్వులు ఉయ్యాలో
రౌద్రంగా పూసిన ఉయ్యాలో
రుద్రాక్ష పూలు ఉయ్యాలో
గుంపులుగా పూసిన ఉయ్యాలో
గునుక పూలు ఉయ్యాలో
తీరొక్క పువ్వులు ఉయ్యాలో
తీగ కట్ల పూలు ఉయ్యాలో
అక్కచెళ్లెల్లంత ఉయ్యాలో
తెంపిరి పువ్వులు ఉయ్యాలో
గుల్లల్లో నింపిరి ఉయ్యాలో
ఇంటికి చేరిరి ఉయ్యాలో
తెచ్చిన పువ్వులను ఉయ్యాలో
రాసి పోసిండ్రమ్మ ఉయ్యాలో
రంగు రంగు పూలు ఉయ్యాలో
పేర్చిరి బతుకమ్మ ఉయ్యాలో
తీరొక్క పువ్వుతొ ఉయ్యాలో
తీరైన బతుకమ్మలు ఉయ్యాలో
రంగుల బతుకమ్మలు
ఉయ్యాలో
రత్నాల బతుకమ్మలు
ఉయ్యాలో
ముద్దుముద్దు పులు ఉయ్యాలో
మురిపాల బతుకమ్మలు
ఉయ్యాలో
తీరైన పూలతో ఉయ్యాలో
రాశైన బతుకమ్మ ఉయ్యాలో
పన్నెండు రంగుల ఉయ్యాలో
పేర్చిరి బతుకమ్మను ఉయ్యాలో
రాజ్యాన లేని ఉయ్యాలో
రవికలు తొడిగిరి ఉయ్యాలో
దేశాన లేని ఉయ్యాలో
చీరలు కట్టిరీ ఉయ్యాలో
బంగారు వడ్డనము ఉయ్యాలో
నడుముకు పెట్టిరీ ఉయ్యాలో
తీరొక్క సొమ్ములు ఉయ్యాలో
తీరైన హారాలు ఉయ్యాలో
నలుగురక్క చెళ్లెల్లు ఉయ్యాలో
నవనీత మెరుపులె ఉయ్యాలో
బతుకమ్మలెత్తుకొని ఉయ్యాలో
బయలెల్లినారమ్మ ఉయ్యాలో
భామలంతా కూడి ఉయ్యాలో
పద్దెంది వాడలు ఉయ్యాలో
ఆ పట్టణమందు ఉయ్యాలో
పూజించె బతుకమ్మను
ఉయ్యాలో
పడతులంతా కూడి ఉయ్యాలో
ఆటపాటలతోను ఉయ్యాలో
ఆనందాలతో ఉయ్యాలో
గౌరమ్మను కొలిచి ఉయ్యాలో
గంగమ్మను తలచె ఉయ్యాలో

# శుద్ధ పాడ్యమి నాడు ఉయ్యాలో

శుద్ధ పాడ్యమి నాడు ఉయ్యాలో
అమవాస్య మొదలుకొని
ఉయ్యాలో
ఆ తొమ్మిది దినములు
ఉయ్యాలో
అమ్మను కొలవగా ఉయ్యాలో
తొమ్మిది రోజులు ఉయ్యాలో
నమ్మిక తోడుతో ఉయ్యాలో
అలరి గుమ్మడి పూలు
ఉయ్యాలో
అరుగులు వేయించి ఉయ్యాలో
గోరింట పూలతో ఉయ్యాలో
గోడాలు పెట్టించి ఉయ్యాలో
తామర పులతో ఉయ్యాలో
ద్వారాలు పెట్టించి ఉయ్యాలో
మొగలి పూల తోను ఉయ్యాలో
మొగరాలు ఎక్కించి ఉయ్యాలో

వాయిలి పూలతో ఉయ్యాలో
వాసాలు చేయించి ఉయ్యాలో
పొన్నపూలతోడ ఉయ్యాలో
ఇల్లును కప్పించి ఉయ్యాలో
తంగెడు పూలతో ఉయ్యాలో
తలుపులు వేయించి ఉయ్యాలో
బీర పూల తోను ఉయ్యాలో
తోరణాలు కట్టి ఉయ్యాలో
పసుపు ముద్ద చేసి ఉయ్యాలో
గౌరమ్మను నిలిపి ఉయ్యాలో
చేమంతి పూలతో ఉయ్యాలో
చెలియను పూజించి ఉయ్యాలో
మందార పూలతో  ఉయ్యాలో
మగువ నిన్ను కొలిచి
ఉయ్యాలో
పారిజాతా పూలు ఉయ్యాలో
పావని నను మొక్కి ఉయ్యాలో

గన్నెరు పూలను ఉయ్యాలో
గౌరి నీకర్పించి ఉయ్యాలో
పసుపు కుంకుమలతో
ఉయ్యాలో
బుక్క గులాలతో ఉయ్యాలో
సుందరాంగులెల్ల  ఉయ్యాలో
చుట్టూతా తిరిగిరి ఉయ్యాలో
ఆటలు ఆడిరి ఉయ్యాలో
పాటలు పాడిరి ఉయ్యాలో
ఆటపటలు చూసి ఉయ్యాలో
ఆనందమెరిగిరి ఉయ్యాలో
గౌరమ్మ వరమిచ్చె ఉయ్యాలో
ఆ కాంతలందరికి ఉయ్యాలో
పాడిన వారికి ఉయ్యాలో
పాడిపంటల నిచ్చు ఉయ్యాలో
ఆడిన వారికి ఉయ్యాలో
అష్ట ఐశ్వర్యాలు ఉయ్యాలో

# చింతాకు పాపెట చందమామ

చింతాకు పాపెట చందమామ
తీసేది ఎవరమ్మ చందమామ
సిరిపురం దుర్గాలు చందమామ
ఏలేది ఎవరమ్మ చందమామ
దొడ్డుయి ముత్యాలు
చందమామ
కుచ్చేది ఎవరమ్మ చందమామ
సన్న సన్న రత్నాలు
చందమామ
కుచ్చేది ఎవరమ్మ చందమామ
అంతపురమందు చందమామ
మెదిలేది ఎవరమ్మ చందమామ
అరుగుమీద అద్దము
చందమామ
చుసేది ఎవరమ్మ చందమామ
వందనాలతోని చందమామ

వచ్చేది ఎవరమ్మ చందమామ
ర్యాలాకు రవికలు చందమామ
తొడిగేది ఎవరమ్మ చందమామ
చక్కని పాలన చందమామ
చేసేది ఎవరమ్మ చందమామ
చింతాకు పాపెట చందమామ
తీసేది మాతల్లి చందమామ
సిరిపురం దుర్గాలు చందమామ
ఏలిండు మా తండ్రి
చందమామ
దొడ్డుయి ముత్యాలు
చందమామ
కుచ్చేది మా అక్క చందమామ
సన్న సన్న రత్నాలు
చందమామ
కుచ్చేది మా చెల్లె చందమామ

అంతపురంలోన చందమామ
మెదిలేది మా మరిది
చందమామ
అరుగుమీద అద్దము
చందమామ
చూసేది నా అన్న చందమామ
వందనాలతోని చందమామ
వచ్చేది మా వదిన చందమామ
ర్యాలాకు రవికలు చందమామ
తొడిగేది నేనమ్మ చందమామ
చక్కని పాలన చందమామ
చేసేది నా భర్త చందమామ
నా పేరు జానకి చందమామ
నా భర్త రాఘువులు చందమామ
నా పేరు జానకి చందమామ
నా భర్త రాఘువులు చందమామ

# సీత చెంత లేక ఉయ్యాలో

సీత చెంత లేక ఉయ్యాలో
చిన్నబోయె రాముడుయ్యాలో
అర్థాంగి లేక ఉయ్యాలో
రందితో కూర్చుండె ఉయ్యాలో
సీత జాడ తెల్వక ఉయ్యాలో
చింతతో కూర్చుండె ఉయ్యాలో
అప్పుడే వచ్చెను ఉయ్యాలో
అంజనేయుడమ్మ ఉయ్యాలో
ఎందుకు ఓ రామ ఉయ్యాలో
కోదండ రామ ఉయ్యాలో
కలత చెందకు తండ్రి
ఉయ్యాలో
కారణ జన్ముడా ఉయ్యాలో

సముద్రాలు దాటి ఉయ్యాలో
తల్లి జాడను దెత్తు ఉయ్యాలో
సీతమ్మ జాడకై ఉయ్యాలో
వేగిరం పోయెద ఉయ్యాలో
వాయుపుత్రుడమ్మ ఉయ్యాలో
వేగంగ ఎగిరిండు ఉయ్యాలో
రావణుని రాజ్యము ఉయ్యాలో
లంకను చేరిండు ఉయ్యాలో
సీతమ్మ జాడకై ఉయ్యాలో
వెతకసాగు చుండె ఉయ్యాలో
గాజు స్థంభాలతో ఉయ్యాలో
లంకా నగరమంతా ఉయ్యాలో
పసిడితో మెరిసెనె ఉయ్యాలో

ఘనమైన మేడలు ఉయ్యాలో
పగిడి కుందనముతో ఉయ్యాలో
పడతులా ఆ నగరి ఉయ్యాలో
నిలువు టద్దాలతో ఉయ్యాలో
హెచ్చైన ఆ గృహము
ఉయ్యాలో
ఎక్కడా చూసినా ఉయ్యాలో
వెండివీ ప్రతిమలు ఉయ్యాలో
గోడాలా చిత్తారు ఉయ్యాలో
ఘనమైన చిత్రంబులుయ్యాలో
నిగ నిగా మెరిసేటి ఉయ్యాలో
నీలంపు జ్యోతులు ఉయ్యాలో
జలతారు వస్త్రాలు ఉయ్యాలో

ధగాధగా మెరియును
ఉయ్యాలో
అత్తరు పన్నీరు ఉయ్యాలో
మేడపై కాంతలు ఉయ్యాలో
ఏడు ధర్వాజలు ఉయ్యాలో
హనుమంతుడూ దాటె
ఉయ్యాలో
మద్య రంగములోన ఉయ్యాలో
బంగారు రథములో ఉయ్యాలో
బయలెల్లె రావణుడు ఉయ్యాలో
పొడ చూసి
హనుమంతుడుయ్యాలో
పడదన్నుదూ ననుచు
ఉయ్యాలో
పండ్లు పటపట కొరికె
ఉయ్యాలో
రద్ది చేయను చూసె ఉయ్యాలో
కోటి కాంతలను ఉయ్యాలో
చూసెను హనుమంతుడు
ఉయ్యాలో
ఎక్కడా దాచిండొ ఉయ్యాలో
ఏడేడ పొడచూతు ఉయ్యాలో
వెళ్లెనూ హనుమంతుడు
ఉయ్యాలో
వేగవీధికపుడు ఉయ్యాలో
శృంగార వనముకు ఉయ్యాలో
చేరెను హనుమంతుడు
ఉయ్యాలో
సీతమ్మ ఎక్కడని ఉయ్యాలో
వెతుకుచూ సాగెనూ ఉయ్యాలో
అశోక వనమందు ఉయ్యాలో
ఆ తల్లి కనిపించె ఉయ్యాలో

అమ్మను చూడగా ఉయ్యాలో
హనుమ సంతోషించె
ఉయ్యాలో
అమిత ఆనందంతో ఉయ్యాలో
సీత చెంత చేరె ఉయ్యాలో
ముడవని కురులతో ఉయ్యాలో
ముతక చీరతో ఉయ్యాలో
భర్త ధ్యాసలోన ఉయ్యాలో
రంధితో కూర్చుండె ఉయ్యాలో
అది చూసి
హనుమంతుడుయ్యాలో
అమ్మ వద్దకు చేరె ఉయ్యాలో
ఆయమ్మ పాదాలకుయ్యాలో
భక్తితో ప్రణమిల్లె ఉయ్యాలో
మొఖము చూడక సీత
ఉయ్యాలో
మాట ఇట్లనియె ఉయ్యాలో
ఓరి మాయలోడ ఉయ్యాలో
మాయావి రావణా ఉయ్యాలో
వేషాలు చాలించి ఉయ్యాలో
వెళ్లుమిచటీ నుండి ఉయ్యాలో
అదివినీ హనుమ ఉయ్యాలో
ఇట్టి సంగతి చెప్పె ఉయ్యాలో
నా తండ్రి రాముడు ఉయ్యాలో
నీ ప్రాణనాథుడు ఉయ్యాలో
పంపెను నన్ననుచు ఉయ్యాలో
అంగులికమ్ము జూపె ఉయ్యాలో
అది చూసి సీతమ్మ ఉయ్యాలో
అనందము చెందె ఉయ్యాలో
కడుపులో దుఖము ఉయ్యాలో
కండ్లల్ల భాదతో ఉయ్యాలో
నా రాముడెట్లుండె ఉయ్యాలో

ఆత్రంగ అడిగింది ఉయ్యాలో
రాముని సంగతులు ఉయ్యాలో
తెలిపెను
హనుమంతుడుయ్యాలో
రావణుని చెరనుండి ఉయ్యాలో
విడిపించెద నిన్ను ఉయ్యాలో
వల్లనని సీతమ్మ ఉయ్యాలో
ఇట్లు పలికెను తల్లి ఉయ్యాలో
రాముడే రావాలి ఉయ్యాలో
రావణున్ని చంప ఉయ్యాలో
అనుచు సీతమ్మ ఉయ్యాలో
చూడామణిని ఇచ్చింది
ఉయ్యాలో
రావణుని వధియించ
ఉయ్యాలో
మళ్లి వచ్చెదమునుచు
ఉయ్యాలో
సీత ఆజ్ఞను పొంది ఉయ్యాలో
వెనుదిరిగె
హనుమంతుడుయ్యాలో

# శుక్రవారం లక్ష్మి ఉయ్యాలో

శుక్రవారం లక్ష్మి ఉయ్యాలో
మా ఇంటికొస్తేను ఉయ్యాలో
కుంకుమ భరిణతో ఉయ్యాలో
నేనెదురు కుందును ఉయ్యాలో
శనివారం లక్ష్మి ఉయ్యాలో
మా ఇంటికొస్తేను ఉయ్యాలో
శనిగపూల రైకతొ ఉయ్యాలో
నేనెదురు కుందును ఉయ్యాలో
ఆదివారం లక్ష్మి ఉయ్యాలో
మా ఇంటికొస్తేను ఉయ్యాలో
అల్లిపూదండతో ఉయ్యాలో
నేనెదురు కుందును ఉయ్యాలో
సోమవారం లక్ష్మి ఉయ్యాలో
మా ఇంటికొస్తేను ఉయ్యాలో
సొమ్ములు పెట్టుకొని
ఉయ్యాలో
నేనెదురు కుందును ఉయ్యాలో
మంగళవారం లక్ష్మి ఉయ్యాలో
మా ఇంటికొస్తేను ఉయ్యాలో
మంగళారతులతొ ఉయ్యాలో
నేనెదురు కుందును ఉయ్యాలో
బుధవారం లక్ష్మి ఉయ్యాలో
మా ఇంటికొస్తేను ఉయ్యాలో
బుక్క గులాలుతో ఉయ్యాలో
నేనెదురు కుందును ఉయ్యాలో
గురువారం లక్ష్మి ఉయ్యాలో
మా ఇంటికొస్తేను ఉయ్యాలో
కుంకుమ భరిణతో ఉయ్యాలో
నేనెదురు కుందును ఉయ్యాలో
సంధ్యవేల లక్ష్మి ఉయ్యాలో
మా ఇంటికొస్తేను ఉయ్యాలో
సంపంగి పూలతో ఉయ్యాలో
నేనెదురు కుందును ఉయ్యాలో
ఉదయాన లక్ష్మి ఉయ్యాలో
మా ఇంటికొస్తేను ఉయ్యాలో
పారిజాతాలతొ ఉయ్యాలో
నేనెదురు కుందును ఉయ్యాలో
మద్యాహ్నం లక్ష్మి ఉయ్యాలో
మా ఇంటికొస్తేను ఉయ్యాలో
మంచి గంధంతో ఉయ్యాలో
నేనెదురు కుందును ఉయ్యాలో
సోమవారం లక్ష్మి ఉయ్యాలో
మా ఇంటికొస్తేను ఉయ్యాలో
మా అక్క బావలతో ఉయ్యాలో
నేనెదురు కుందును ఉయ్యాలో
మంగళవారం లక్ష్మి ఉయ్యాలో
మా ఇంటికొస్తేను ఉయ్యాలో
తమ్ముడు మరదలితొ
ఉయ్యాలో
నేనెదురు కుందును ఉయ్యాలో
బుధవారం లక్ష్మి ఉయ్యాలో
మా ఇంటికొస్తేను ఉయ్యాలో
బిడ్డ అల్లుడుతో ఉయ్యాలో
నేనెదురు కుందును ఉయ్యాలో
గురువారం లక్ష్మి ఉయ్యాలో
మా ఇంటికొస్తేను ఉయ్యాలో
చెల్లెలు మరిదితో ఉయ్యాలో
నేనెదురు కుందును ఉయ్యాలో
ఏ దారినొచ్చినా ఉయ్యాలో
ఏ వేళనొచ్చినా ఉయ్యాలో
మా ఇంటి లక్ష్మివి ఉయ్యాలో
మా సిరుల తల్లివి ఉయ్యాలో
ఇంటిల్లి పాదిమి ఉయ్యాలో
నిన్నెదురుకుందుము
ఉయ్యాలో

# అక్కచెల్లెల్లు కూడి తొవ్వా నడవంగా

అక్కచెల్లెల్లు కూడి తొవ్వా నడవంగా
నాగమల్లియలో
బాటా నడవంగా తీగమల్లియలో
అక్కాకు దొరికింది ముత్యాల దండ
నాగమల్లియలో
కుచ్చుల దండ తీగమల్లియలో
అక్కా నీకెక్కడిదే ముత్యాల దండ
నాగమల్లియలో
కుచ్చుల దండ తీగమల్లియలో
ఎములాడా రాజన్న ఏసిండే చెల్లే నాగమల్లియలో
ఇచ్చిండే చెల్లే తీగమల్లియలో
ఎములాడా రాజన్నఎట్లుంటడక్కా
నాగమల్లియలో
ఎడుంటాడక్కా తీగమల్లియలో
త్రిశులము పట్టుకున్న జడల శంకరుడే
ఎములాడలుండే తీగమల్లియలో
ఏమిచూసి వెలసిండే ఎములాడలోనా
నాగమల్లియలో
ఎములాడా దేవా తీగమల్లియలో
గుంపు చింతల్లు చూసి గుండాలు చూసి
నాగమల్లియలో
గుడులను చూసి తీగమల్లియలో

అక్కచెల్లెల్లు కూడి తొవ్వా నడవంగా
నాగమల్లియలో
బాటా నడవంగా తీగమల్లియలో
చెల్లెకు దొరికింది వజ్రాల దండ నాగమల్లియలో
వన్నెల దండ తీగమల్లియలో
చెల్లే నీకెక్కడిదే వజ్రాల దండ నాగమల్లియలో
వన్నెల దండ తీగమల్లియలో
యాదగిరి నర్సన్నా ఏసిండే అక్కా నాగమల్లియలో
ఇచ్చిండే అక్కా తీగమల్లియలో
యాదగిరి నర్సన్నా ఎట్లుంటడు చెల్లే
నాగమల్లియలో
ఏడుంటడే చెల్లే తీగమల్లియలో
పిలవగానే పలికేటీ లక్ష్మీ నరసింహుడే
నాగమల్లియలో
యాదగిరిల ఉండే తీగమల్లియలో
ఏమిచూసి వెలసిండూ ఆ కొండలమీద
నాగమల్లియలో
ఆ గుహల నడుమా తీగమల్లియలో
గుండాలు చూసిండు గుట్టలను చుసి
నాగమల్లియలో
గుడులను చూసి తీగమల్లియలో

అక్కచెల్లెల్లు కూడి తొవ్వా నడవంగా
నాగమల్లియలో
దారే నడవంగా తీగమల్లియలో
అక్కాకు దొరికింది రత్నాల దండ నాగమల్లియలో
మెరిసేటి దండ తీగమల్లియలో
అక్కా నీకెక్కడిదే రత్నాల దండ నాగమల్లియలో
మెరిసేటి దండ తీగమల్లియలో
కొమిరెల్లి మల్లన్న ఏసిండే చెల్లే నాగమల్లియలో
ఇచ్చిండే చెల్లే తీగమల్లియలో
కొమిరెల్లి మల్లన్నఎట్లుంటడక్కా నాగమల్లియలో
ఎడుంటాడక్కా తీగమల్లియలో
కోరమీసంవాడు మల్లన్న దేవా నాగమల్లియలో
కొమిరెల్లి లుంటడే తీగమల్లియలో
ఏమిచూసి వెలసిండే కొమిరెల్లిలోనా
నాగమల్లియలో
మల్లన్నా దేవా తీగమల్లియలో
సుక్కల పర్వత మెక్కే సూది గుండూలే

నాగమల్లియలో
సుసి వెలసిండె తీగమల్లియలే

అక్కచెల్లెల్లు కలిసి తొవ్వా నడవంగా
నాగమల్లియలో
దారే నడవంగా తీగమల్లియలో
చెల్లెకు దొరికింది పగడాల దండ నాగమల్లియలో
మేలైనా దండా తీగమల్లియలో
చెల్లే నీకెక్కడిదే పగడాల దండ నాగమల్లియలో
మేలైనా దండ తీగమల్లియలో
సమ్మక్క సారక్కా ఏసింద్రే అక్కా నాగమల్లియలో
ఇచ్చింద్రే అక్కా తీగమల్లియలో
సమ్మక్క సారక్కా ఎట్లుంటరే చెల్లే నాగమల్లియలో
ఏడుంటరే చెల్లే తీగమల్లియలో
గద్దెలమీద ఉన్న తల్లీబిడ్డలే నాగమల్లియలో
మేడారంల ఉంద్రే తీగమల్లియలో
ఏమిచూసి వెలసిండూ ఆ అడవుల మధ్య
నాగమల్లియలో
ఆ గుట్టల నడుమా తీగమల్లియలో
చిలకల గుట్టను చూసి అడవులను చూసి
నాగమల్లియలో
వాగులను చూసి తీగమల్లియలో

# గంగమ్మ గౌరమ్మ కోల్

గంగమ్మ గౌరమ్మ కోల్
గవ్వలాడంగ కోల్
గవ్వ చిట్లిపాయె కోల్
కయ్యమయ్యింది కోల్
అలిగెను గంగమ్మ కోల్
వీరన్న బావిలో కోల్
నీళ్లన్నా లేవు కోల్
మల్లన్న బావిలో కోల్
మానెడైనా లేవు కోల్
సోమన్న బావిలో కోల్
సొలెడైనా లేవు కోల్
కైలాసవాసునికి కోల్
పూజకు వేళాయె కోల్
కయ్యాలేలమ్మా కోల్
నిల్లొదులే గంగా కోల్
సల్లకావల్లొచ్చే కోల్
స్నానం చెయ్యే అక్కా కోల్
నేతికావల్లొచ్చే కోల్
స్నానం చెయ్య గౌరి కోల్
పెరుగుకావల్లొచ్చే కోల్
స్నానం చెయ్యే గౌరి కోల్
నీళ్లు లేని స్నానం కోల్
ఎట్ల జెయ్యనె గంగా కోల్
కొడుకు వీరన్నను కోల్
నికిస్తా గంగమ్మ కోల్
నీళ్లను వదలమ్మ కోల్
నా చెల్లె గంగమ్మ కోల్
కొడుకు వీరన్న కోల్
నాకు కొడుకు కాదా కోల్
కోడలు భద్రకాలి కోల్
నీకిస్తనే గంగా కోల్
కోడలు భద్రకాలి కోల్
నా కోడలు కాదా కోల్
నేను పెట్టే సొమ్ములు కోల్
నీకిస్తనే గంగా కోల్
నీకు సొమ్ములుంటే కోల్
నాకు లేవా యేమి కోల్
నేను తొడిగిన రవికలు కోల్
నీకిస్త గంగమ్మా కోల్
నీకు రైకాలుంటే కోల్
నాకు లేవా యేమి కోల్
నేను కట్టే చీరలు కోల్
నీకిస్తనే గంగా కోల్
నీకు చీరలేగాని కోల్
నాకు లేవా యేమి కోల్
నాలో కలిసున్నా కోల్
నా ప్రాణనాథుడు కోల్
జడలా శంకరుని కోల్
నీకిస్త గంగమ్మ కోల్
అప్పుడు గంగమ్మా కోల్
అలకను మానింది కోల్
ముసిముసి నవ్వింది కోల్
చెంగున దుంకింది కోల్
బుగబుగ గంగమ్మ కోల్
బుడగలై పొంగింది కోల్
గలగల గంగమ్మ కోల్
కాల్వలై పారింది కోల్
అప్పుడు గౌరమ్మ కోల్
స్నానాలాడింది కోల్

# గుంపు గుంపు గునుగుల్లా నేరియాలో

గుంపు గుంపు గునుగుల్లా నేరియాలో
గుంపు గునుగూ పూల నేరియాలో
తెంపరాదె నాయన్న నేరియాలో
గుల్లల్ల నింపరాదె నేరియాలో

పచ్చపచ్చ తంగెళ్ల నేరియాలో
పచ్చ తంగేడి పూలు నేరియాలో
తెంపరాదు నాయన్న నేరియాలో
గంపల్ల కెత్తరాదె నేరియాలో

అడవిలున్న చెట్లపూలు నేరియాలో
తీగవారె కట్లపూలు నేరియాలో
తెంపరాదె నాయన్న నేరియాలో
మొంటెల్ల నింపరాదె నేరియాలో

మాయింటి వదినలు నేరియాలొ
పువ్వులన్ని ఏరినారు నేరియాలొ
సక్కాని పువ్వులన్ని నేరియాలో
సాపలల్ల పోసినారె నేరియాలో

తీరొక్క రంగులద్ది నేరియాలొ
తీరితీరి పువ్వులాయె నేరియాలొ
పేర్చినారు బతుకమ్మ నేరియాలో
నూటొక్క వరుసల్లో నేరియాలో

రవ్వాల గాజులేసి నేరియాలో
చెక్కుడు బిల్లలు పెట్టి నేరియాలో
చుక్కబొట్టు పెట్టుకోని నేరియాలో
దిద్దినారు కాటుక నేరియాలో

సిద్దిపేట చీరల్లో నేరియాలో
సిరిసిల్లా రవికాలు నేరియాలో
ముక్కూకు ముక్కెరమ్మ నేరియాలో
ముత్యాల దండలమ్మ నేరియాలో

బతుకమ్మలెత్తుకోని నేరియాలో
బాజారులన్ని కదిలె నేరియాలో
ఆడినారు బతుకమ్మ నేరియాలో
ఆడపిల్లలంతా కూడి నేరియాలో

మలీద ముద్దాలు నేరియాలో
మంచి శనిగేలు పులిహోర నేరియాలో
తీరొక్క వంటలతో నేరియాలో
బతుకమ్మ సద్దులు నేరియాలో
మావూరి బతుకమ్మ నేరియాలో
మళ్లి మళ్లి రావె బతుకమ్మ నేరియాలో
ఎల్లి రావె బతుకమ్మ నేరియాలో
తల్లి సిరులనిచ్చె బతుకమ్మ నేరియాలో

# మామిడి పూసె మామిడి

మామిడి పూసె మామిడి కాసెనా మదానో నావయారి || 2 ||
మామిడి పండ్లు ఏవరిపాలయో మదానో నావయారి || 2 ||
పైనపోయె పక్షుల పాలయో మదానో నావయారి || 2 ||
పండ్లుతిని రచ్చలెలెనా మదానో నావయారి || 1 ||
పండ్లుతిని రచ్చలెలె పండ్లుతిని రచ్చలెలె
పండ్లుతిని రచ్చలెలెనా మదానో నావయారి

జామ పూసె జామ కాసెనా మదానో నావయారి || 2 ||
జామ పండ్లు ఎవరి పాలయో మదానో నావయారి || 2 ||
పైనపోయె పక్షుల పాలయో మదానో నావయారి || 2 ||
పండ్లుతిని రచ్చలెలెనా మదానో నావయారి || 1 ||
పండ్లుతిని రచ్చలెలే పండ్లుతిని రచ్చలెలె''
పండ్లుతిని రచ్చలెలెనా మదానో నావయారి

రేగు పూసె రేగు పూసెనా మదానో నావయారి || 2 ||
రేగు పండ్లు ఏవరిపాలయో మదానో నావయారి || 2 ||
పైనపోయె పక్షుల పాలయో మదానో నావయారి || 2 ||
పండ్లుతిని రచ్చలెలెనా మదానో నావయారి || 1 ||
పండ్లుతిని రచ్చలెలే పండ్లుతిని రచ్చలెలె
పండ్లుతిని రచ్చలెలెనా మదానో నావయారి

నిమ్మ పూసి నిమ్మకాసెనా మదానో నావయారి
నిమ్మ పండు ఏవరిపాలయో మదానో నావయారి || 2 ||
పైనపోయె పక్షుల పాలయో మదానో నావయారి || 2 ||
పండ్లుతిని రచ్చలెలెనా మదానో నావయారి || 1 ||
పండ్లుతిని రచ్చలెలే పండుతిని రచ్చలెలె
పండ్లుతిని రచ్చలెలెనా మదానో నావయారి

కోతమామిడి చెట్లలో మదానో నావయారి
కొౖరసేను పూత పూసె కాతకాసెనా మదానో నావయారి
కొౖరలెవరి పాలు పోయో మదానో నావయారి || 2 ||
పైనపోయె పక్షుల పాలయో మదానో నావయారి || 2 ||

కొఱ్రలు బుక్కి రచ్చలెలేనా మదానో నావయారి || 1 ||
కొఱ్రలు బుక్కి రచ్చలెలే కొఱ్రలు బుక్కి రచ్చలెలే
కొఱ్రలు బుక్కి రచ్చలెలెనా మదానో నావయారి

ఏటిమీద ఎర్రజొన్న మదానో నావయారి || 2 ||
పూతపూసి కాతకాసెనా మదానో నావయారి || 2 ||
జొన్నలెవరి పాలయో మదానో నావయారి || 2 ||
పైనపోయె పక్షుల పాలయె మదానో నావయారి || 2 ||
జొన్నలు బుక్కి రచ్చలెలెనా మదానో నావయారి || 1 ||
జొన్నలు బుక్కి రచ్చలెలె జొన్నలు బుక్కి రచ్చలెలె
జొన్నలు బుక్కి రచ్చలెలెనా మదానో నావయారి

గట్టు కింద కింది సెనురో మదానో నావయారి || 2 ||
పూతకాసి కాతకాసెనా మదానో నావయారి || 2 ||
కందులెవరి పాలయో మదానో నావయారి || 2 ||
పైన పోయె పక్షుల పాలయె మదానో నావయారి || 2 ||
కందులు బుక్కి రచ్చలెలెనా మదానో నావయారి || 1 ||
కందులు బుక్కి రచ్చలెలె కందులు బుక్కి రచ్చలెలె''
కందులు బుక్కి రచ్చలెలెనా మదానో నావయారి

మడికింద మక్క సేనురో మదానో నావయారి || 2 ||
పూతపూసి కాతకాసెనా మదానో నావయారి || 2 ||
మక్కలెవరి పాలయో మదానో నావయారి || 2 || డ్లు
పైనపోయె పక్షుల పాలయె మదానో నావయారి || 2 ||
మక్కలు బుక్కి రచ్చలెలెనా మదానో నావయారి || 1 ||
మక్కలు బుక్కి రచ్చలెలెనా మక్కలు బుక్కి రచ్చలెలె''
మక్కలు బుక్కి రచ్చలెలెనా మదానో నావయారి

చెరువు కింద చెనగసేనురో మదానో నావయారి || 2 ||
పూతపూసి కాతకాసెనా మదానో నావయారి || 2 ||
చెనగలెవరి పాలయో మదానో నావయారి || 2 ||
పైనపోయె పక్షుల పాలయెనా మదానో నావయారి || 2 ||
చెనగలు బుక్కి రచ్చలెలెనా మదానో నావయారి || 1 ||
చెనగలు బుక్కి రచ్చలెలె చెనగలు బుక్కి రచ్చలెలె''
చెనగలు బుక్కి రచ్చలెలెనా మదానో నావయారి

ముద్దబంతులు గునుగు తంగేడుపూల
"బంగారు బతుకమ్మ" కొలువు తీరంగ
నేలమ్మ పులకించి గొంతెత్తె గానం
మట్టి వాసనలున్న మా తెలంగాణం



తెలంగాణ జాగృతి

#1-2-234/13/46/4, 3rd Floor Pasham Amrutharam Residency, Arvind Nagar,
Domalguda, Hyderabad - 500029, Telangana State, India. Phone and Fax : 040 2765 5678
Website: telanganajagruthi.org, Facebook: fb.com/TelanganaCulture

www.mohanpublications.com

# మోహన్ పబ్లికేషన్స్‌లో లభించు

# పుస్తకముల పట్టిక

## (Book List)

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆయుర్వేద, మంత్రశాస్త్రాది
అనేక విషయాలు తెలుసుకోండి...

ఫేస్‌బుక్ **మోహన్ పబ్లికేషన్స్** పేజ్ లైక్ చేయండి.



Like us to follow :

**MOHAN PUBLICATIONS**

Rajamahendravaram

## మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

| | | |
|---|---|---|
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |

## 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్ఛరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాధ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | "శ్రీసాయి"కోటి | 27-00 |
| 18. | "శ్రీసాయిరామ్"కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |

| | | |
|---|---|---|
| 24. | శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం | 63-00 |
| 25. | ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు | 15-00 |
| 26. | షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం | 99-00 |
| 27. | సాయిసత్యవ్రతం | 30-00 |
| 28. | సాయి అనుగ్రహమ్ | 120-00 |
| 29. | నవగురువారాల వ్రతకల్పము | 15-00 |
| 30. | శ్రీదత్తలీలామృతము | 99-00 |
| 31. | హృదయంలో సాయి | 15-00 |
| 32. | శ్రీషిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్ఛరిత్ర) | 120-00 |
| 33. | గజాననమహరాజ్ చరిత్ర | 99-00 |

## 4. జ్యోతిషాలు

| | | |
|---|---|---|
| 1. | 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) | 72-00 |
| 2. | గ్రహభూమి పంచాంగము (గార్గేయ) | 108.00 |
| 3. | ఆనందసిద్ధి పంచాంగం (వై.వి.శాస్త్రి) | 63.00 |
| 4. | ములుగు వారి రాశిఫలితాలు (12రాశులువారికి) | 50.00 |
| 5. | ములుగు వారి రాశిఫలితాలు విడివిడిగాఒక్కొక్కటి | 12.00 |
| 6. | కాలచక్రంజ్యోతిషక్యాలండర్ | 25.00 |
| 7. | గ్రహబలం క్యాలండర్ (శ్రీనివాసగార్గేయ-భక్తిటివి) | 25.00 |
| 8. | శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ | 25.00 |
| 9. | సాదా క్యాలండర్ | 5.00 |
| 10. | పాకెట్ క్యాలండర్ | 15.00 |
| 11. | తాజకనీలకంఠీయమ్ | 100-00 |
| 12. | కేరళ జ్యోతిష రహస్యాలు | 180-00 |
| 13. | జ్యోతిష బ్రహ్మ రహస్యాలు | 180-00 |
| 14. | మానసాగరి జాతకపద్ధతి | 180-00 |
| 15. | వరాహమిహిర జాతకపద్ధతి | 180-00 |
| 16. | వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు | 99-00 |
| 17. | సింపుల్ రెమిడీస్ | 180-00 |
| 18. | శంభు హోరప్రకాశిక | 250-00 |
| 19. | పూర్వ పరాశరి | 100-00 |
| 20. | పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం | 200-00 |
| 21. | ప్రశ్న సింధు | 99-00 |
| 22. | నక్షత్ర విశేష ఫలితాలు | 63-00 |
| 23. | సూర్యసిద్ధాంతపంచాంగగణితంచేయడంఎలా? | 180-00 |
| 24. | దృక్సిద్ధాంతపంచాంగగణితం చేయడంఎలా? | 180-00 |

| | | |
|---|---|---|
| 25. | ఆయుర్దాయ నిర్ణయం | 63-00 |
| 26. | జాతక గణిత ప్రవేశిక | 63-00 |
| 27. | జ్యోతిషమర్మబోధిని | 63-00 |
| 28. | జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 63-00 |
| 29. | ముహూర్తం నిర్ణయించడంఎలా? | 63-00 |
| 30. | జాతక మకరందం | 63-00 |
| 31. | జ్యోతిష సరస్వతి | 63-00 |
| 32. | మీజననకాల విశేషాలు | 63-00 |
| 33. | ముహూర్త విజ్ఞాన భాస్కరం | 63-00 |
| 34. | జ్యోతిష స్వయంబోధిని | 63-00 |
| 35. | శుభముహూర్త శిరోమణి | 63-00 |
| 36. | నక్షత్ర ఫలమంజరి | 36-00 |
| 37. | పంచాంగం చూసే విధానం | 36-00 |
| 38. | సర్వార్థ జ్యోతిషం | 36-00 |
| 39. | ప్రాథమిక జ్యోతిషం | 36-00 |
| 40. | నవరత్నములు శుభయోగములు | 36-00 |
| 41. | శుభశకునాలు | 30-00 |
| 42. | హస్తరేఖాఫలితాలు | 36-00 |
| 43. | సంఖ్యల్లో భవిష్యత్ | 36-00 |
| 44. | ముహూర్త దీపిక | 99-00 |
| 45. | పుట్టుమచ్చలు ఫలితాలు | 30-00 |
| 46. | కలలు ఫలితాలు | 30-00 |
| 47. | జాతక చక్రం వేయడం ఎలా? | 36-00 |
| 48. | మానసాగరి (ప్రాచీనజ్యోతిషగ్రంథం) -పుచ్చాశ్రీనివాసరావు | 250-00 |
| 49. | జ్యోతిషశాస్త్ర చిట్కాలు | 120-00 |
| 50. | గుప్తా శతాబ్ది పంచాంగం (1940-2050) | 999-00 |
| 51. | ప్రశ్నచండేశ్వరమ్ | 63-00 |
| 52. | ద్వాదశభావ ఫలచంద్రిక | 250-00 |
| 53. | జ్యోతిష శతయోగరత్నావళి (నూరుయోగాలఫలితాలు) | 120-00 |
| 54. | అంగసాముద్రికం | 36-00 |
| 55. | హస్త సాముద్రికం | 63-00 |
| 56. | లాల్ కితాబ్ | 99-00 |
| 57. | శకునశాస్త్రం | 63-00 |
| 58. | ఆధునికప్రశ్నశాస్త్రం | 120-00 |
| 59. | పరాశరజ్యోతిష ప్రశ్నజ్యోతిషం | 180-00 |

